Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

బేరం రాకపోతే కునుకు

పంపినవారు :
బి. వి. రామారావు - ఎండాడ

మనోహరమైన
ముఖ లావణ్యమునకు
సులభమయిన కిటుకు....





అశోకా
ఫ్లవర్ అఫ్ హెవెన్
స్నో



నవవికసిత పుష్పమువలె నున్న
మీ ముఖవర్చస్సు అందరను
ఆశ్చర్యచకితులను చేయును.



విజయా కెమికల్సు, మద్రాసు - 7.




రిజిస్టర్డు నం. 119923

## డైమండ్ సుగంధవక్క పొడి

### ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్క పొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకింటికి 2 న. పై. మాత్రమే.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్ బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - ఆదోని - హుబ్లి.



## అందులో విశేషమైనది ఏముంది?

తెలిసింది. ఒక ప్యాకెట్టు గ్లూకో బిస్కట్లు ఉన్నాయి! పిల్లల నిత్య ఆహారములో ఒక భాగముగ పార్లెవారి శక్తినిచ్చు గ్లూకో బిస్కట్లను యిచ్చుట ఎంతో మంచిది.

ఉత్సాహవంతులైన పిల్లల ఆహారముతో ఎల్లప్పుడూ కనీసము ఆరు కరకరలాడే తాజాయైన గ్లూకో బిస్కట్లను పెట్టి పంపండి. లేక వారికి యీ రుచికరమైన తియ్యని బిస్కట్లను ప్రొద్దున్న యివ్వండి.

జ్ఞాపకముంచుకోండి: శక్తినిచ్చే పార్లేవారి గ్లూకో బిస్కట్లు మీ పిల్లలకు ఎంతోమంచివి. రోజూ వారికి ఆరు బిస్కట్లను పెట్టండి.




పార్లేవారి
# గ్లూకో
బిస్కట్లు

పార్లె ప్రోడక్ట్సు మ్యాన్యుఫేక్చరింగ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి-24.

PG.59.18.TL.

EVEREST

# ఇది నిక్కము...



...పగిలిన పాత్ర, నీటిని మంచి
పాత్ర ఉంచినట్లు నిలవుంచదు,
శిరోజ రంగుతో నలుపుచేయబడిన
శిరోజముల నలుపు లోమాతో
చేయబడినట్లుగా నిలవుండదు,

శిరోజరంగు శిరోజములను
పైపైని మాత్రమే నలుపుచేయును,
లోమా శిరోజములను సహజంగా నలుపుచేయును,




అగ్రప్రసిద్ధమైన రెండు
కలను సహజంగా నలుపు
చేయునట్టిది,

ఎమ్, ఎమ్. అహమదాబాద్ 1

ఏజంట్లు :

## సి. నరోత్తమ్ అండ్ కో.,
బొంబాయి - 2.

★

## ఢిల్లీ మెడికల్ స్టోర్సు, ఢిల్లీ.

★

## షాహ బవిషి అండ్ కో.,
రాధాబజార్ స్ట్రీట్, కలకత్తా.

★

## జె. బలాభాయ్ అండ్ కో.,
నేతాజీ సుభాష్ రోడ్, మద్రాసు.

---

# అతి సరసమైన మూల్యమునకు అద్వితీయమైన నాణ్యము!!!

వ్రాత ఉత్సాహంగా ఉండడానికి

# రవి సిరాలు




రవి సిరాలందు ద్రావణి "R" కలుపబడింది.

- నిర్విరామమైన ధార
- శాశ్వతమైన రంగు
- శీఘ్రకాలంలో ఆరుట

ఈ ముఖ్య లక్షణాలు కల "రవి" సిరాలను మీ శ్రేష్టమైన ఫౌన్టెన్ కలాలకు వాడండి....

1, 2, 12, 24, ఔన్సుల
ప్యాకింగులలో దొరకును.

సోల్ ఏజెంట్లు :

## ది న్యూ స్టార్ & కో,
## మదరాసు-21.

స్టాకిస్టు :
పెన్‌కార్నర్, సుల్తానా బజారు, హైదరాబాదు.

# తిరిగి ఆశ్చర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది !



వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటి లేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.




వాటర్ బరీస్ కాంపౌండ్ లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసి యుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును.

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును. వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.

ఆరోగ్యమునకు హితమైన

## వాటర్ బరీస్ కాంపౌండ్

వాడుడు



# "ఇంటి వైద్యం"



భర్త ఇలా చెప్పుచున్నాడు

నేను ఆఫీసుకు బైలుదేరాక, కొద్ది నిమిషాల్లోనే తిరిగి వచ్చాను, నాభార్య ఆదుర్దాపడింది, నేను పర్సు గాని, పెన్‌గాని మరచిపోయానా లేక అకస్మాత్తుగా జబ్బు చేసిందా...?

"జబ్బా ? నాకు గాదు, నా షర్టుకు." అన్నాను నా షర్టు వీపు చూపిస్తూ, వాళ్ల తూచే మెషీన్‌లోవలె పది నయా పైసల బిళ్ల పదేంత చిరుగుంది. ఇతర షర్టులు కాలర్లు చిరిగాయని దీన్ని యెన్నుకున్నా ఆ చిరుగు చూడకుండా, కాని బస్సు స్టాండువద్ద నా మిత్రుడు పట్టేశాడు."

ఒక నిమిషంలో కుట్టేస్తా, కొంచెమాలస్యమైనా మీరు ఆఫీసుకు వెళ్లొచ్చు!" అంటూ సూది దారం కోసం వెళ్ల బోయిందావిడ.

"ఎందు కాయవస్థ, నా మిత్రునిద్వారా జబ్బు చీటీ పంపేనులే, మన కివ్వాళ హాయిగా సెలవు!" అన్నాను. ఇది సుఖదినమా ? నా మంచి షర్టులన్నీ మాసిపోయి చాకలి మూటలో వున్నాయి. కులాసాగా పార్కుకైనా, సముద్ర తీరానికైనా లేక మేటినీకైనా వెళ్లలేనుగదా, ఇంక పడకే పరమావధి నాకు ! కళ్లు మూయబోతున్నా, తలుపువద్ద స్త్రీ కంఠధ్వని వినిపించింది." మీ వారికేం జబ్బు ?" అది డాక్టర్ కమల స్వరం. "ఏంలేదు, కొంచెం సుస్తీ", అన్నది మా యావిడ. నేను కంగారు పడ్డాను.

ఆమె నా స్థితిని కనుక్కోవాలని ముందుకొస్తే నాభయం ఎక్కువైంది. ఇలా గొణిగాను, "నాకేం జబ్బా? నాకు కాదు గాని నా షర్టుకు ... ! " ఆమె చిరునవ్వును బట్టి ఆమె స్టెతస్కోప్ కూడా ఏదో రహస్యాన్ని తెలిపిందనుకోవచ్చు. ఎలాగో మా యావిడ ఆమెను పక్కగదిలోకి గొనిపోయింది.

ఇదే ఆలోచనతో కునుకు పోయాను. పొగరెక్కే కాఫీ కప్పుతో మా యావిడ వచ్చి నిద్రలేపగానే గడియారం నాలుగు కొట్టింది.

కాఫీ పీలుస్తూ బల్లపైన పేర్చిన ఉతికిన బట్టల దొంతర చూస్తే కళ్లు మిరిమిట్లు గొలిపాయి.

S/P.4A-50 TL

"ఉతికిన బట్టలు వచ్చాయా ?" అన్నాను.

"ఎలా వున్నాయి ? మెరుస్తున్నాయికదూ ! నా చేతులారా నేనే ఉతికాను" అందావిడ.

అన్ని ఎక్కువ బట్టలా ? అంత తెల్లగానా ? దండాలు కొట్టకుమరీ ! నువ్వతికే శబ్దం వినపడనంత గాఢ నిద్ర పోలేదు నేను !" అన్నాను; "కాని, ఆవిడవిషయమంతా చెప్పగానే ఆశ్చర్య పడ్డాను !"

## భార్య చెప్పుచున్నది

"కమలను అద్భుతంగా మెచ్చుకున్నాను ! ఆమె మానవులకే గాక బట్టలకూ చికిత్సకురాలనిపించింది.





ఆమె బట్టలగురించి, 'నలుగుడు, చిరుగులు, బొత్తాల విరుపులు, ఇంకా ఎన్నో చెప్పుతుంటే ఆనంద పరవశురాలనయ్యాను'',

ఇలా అన్నది: "నీ భర్త అన్నట్లు బట్టల ఆరోగ్యంగురించిన్నీ శ్రద్ధవహించాలి. ఎన్నాళ్లో మురికి బట్టలను ఇంట్లోపడేసివుంచి మనకు కనిపించనిచోట ఉతుకుటకు పంపెయ్య గూడదు. శుద్ధమైన మంచి సబ్బుతో ఇంట్లో మనం ఉతుక్కోవటంతో మరేదీ సాటిలేదు."

"ఇది మంచి మాటే ! కాని ఇంట్లో ఉతుక్కుంటే ఇప్పుడు మీరు ధరించిన చీరంత మెరిసే తెల్లగావుంటుందంటారా ?'' అన్నాను. నా మాట నమ్ము, మా బట్టలన్నిటి లాగే ఈ చీరెను ఇంట్లో నేనే ఉతికాను.'' అని చిరునవ్వుతో జవాబిచ్చింది. "అంతట నన్నామె తనయింటికి తీసుకు వెళ్లింది. అక్కడ ఉతికి ఆరవేసిన మెరిసే బట్టలు కళ్లారా చూశాను !"

"ఎలాగైనా సన్‌లైట్ ధర గురించి ఆలోచిస్తే...'' అంటూంటే ఆమె అందుకున్నది; ''తరుచు బట్టలు చిరిగిపోయి, తరచు కొత్తవి కొనుక్కొనే ఖర్చు ఆలోచిస్తేనో, మరి సన్‌లైట్‌తో అపాయం లేదు. బట్టలన్నిటినీ బాదక్కర్లేకుండా చక్కగా ఉతుక్కో గలిగేంత సమృద్ధయిన గుణవంతమగు నురగను గలిగిస్తుంది. అంటే బట్టలు చాలాకాలం మన్నుతాయి. పైగా, కొద్ది సన్‌లైట్ చాలా బట్ట లను తెల్లగాను, కాంతిగాను ఉతుకుతుంది. నీవు తరుచు సబ్బు కొనక్కర్లేదు. అలా, రెండు విధాలా ఆదాయం; కాదూ ?"

''నే నింటికొస్తూ ఒక సన్‌లైట్ బిళ్ల కొనుక్కొచ్చి ఈ బట్టలన్నీ ఉతుకుటకు వాడేను. ఇది నిజంగా డాక్టరు సలహాను ఋజువు పర్చింది!'' అన్నాను మా ఆయనతో. మెరుస్తూన్న ఆ తెల్లని బట్టలదొంతర ఆశ్చర్యంగా చాలాసేపు చూశాక, ఆయన ఆకస్మాత్తుగా ఉత్సాహపడి "ఈ రాత్రిమనం సినిమాకి వెళ్లుదాం, తయారైయుండు, ప్రేయసీ!" అన్నారు.




S/P.4B-50 TL

బొంబాయిలోని హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్‌వారి ఉత్పత్తి

# సౌందర్య అతిశయం




రాజా స్నో దగ్గర వుంటే, మీరు ఎల్లప్పుడు సౌందర్యాతిశయంతో ప్రకాశిస్తారు. రాజా హెయిర్ ఆయిల్ మరింత కాంతి నిచ్చి, చక్కటి దీర్ఘమైన కేశములను విరివిగా పెంపొందిస్తుంది.









Use RAJA KASTURI SOAP for luxury Bath,
RAJA BAR SOAP for easy washing.

★ ★ ★

MFRS: MANYAM & CO., BANGALORE-3.....

# ఎక్కడ విన్నా న్యూట్రిన్ ప్రశంసే!







పిల్లలకు న్యూట్రిన్ "డ్రమ్" అంటే ఎంతో యిష్టం. ఏమంటే, న్యూట్రిన్ కంపెనీవారు అందముగా ప్యాక్ చేయుటలో కొత్త పద్ధతిని అవలంబిస్తున్నారు. అత్యంత రుచికరమైన న్యూట్రిన్ మిఠాయిలు, టాఫీలు ఒక ఆకర్షణీయమైన పెట్టెలో అమర్చబడిన్ని, ఖరీదు హెచ్చింపబడక, మామూలు వెలకే అన్ని చోటులందు లభిస్తున్నవి.



మీ మధురానందమునకు:

దీ న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కో., లిట్.,

చిత్తూరు - (ఆంధ్ర ప్రదేశ్)

# దీనిని చదివితే మీరు ఆశ్చర్య పడతారు...




మొక్కలు పురుగులను తింటాయని మీరు నమ్మతారా ? ఈ చిత్రములో నున్నది దక్షిణ అమెరికా యందలి "మోహిని ఈగబోను" అనేమొక్క. ఈ చిత్రమునందు 1 వ నంబరులో, ఈగ వస్తున్నది; 2 వ నంబరులో, అది ఆకు మీద కూర్చున్నది; 3 వ నంబరులో, ఆకులు ఆ ఈగ మీద ముడుచు కొంటున్నాయి; 4 వ నంబరులో, ఈగ మ్రింగివేయబడింది.



రెక్కలులేని ఈ రెండు ఈగలను చూడండి।

రెక్కలులేని ఈగలకంటె రెక్కలున్న ఈగలు వ్యాధులను అతివేగంగా చాలా దూరం వ్యాపింపజేస్తాయి. మురికికూడా ఈగల్లాగే వ్యాధిని వ్యాపింప జేయగలదు. మీరేమి చేస్తున్నా మురికి కాకుండా తప్పించుకోలేరు, ఇంక మురికిలో మీ ఆరోగ్యానికి ఎడతెగని ప్రమాదమైనట్టి వ్యాధిని గలిగించే క్రిములున్నాయి.




లైఫ్‌బాయ్ సబ్బుతో ఈ క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడుకోండి. ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయండి. అది మంచి అలవాటు.

L. 232-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.




టిన్నులు-అనేక ఆకృతులలో అందంగా ముద్రించి
బహుమతులుగా ఇవ్వటానికి అర్హమైనవి.



అందరకూ మంచివి
అందరకూ ప్రియమైనవి

**J. B. MANGHARAM & CO.,**
GWALIOR, INDIA

*makers of famous biscuits*

జె. బి. మంఘారామ్ అండ్ కో.,
గ్వాలియర్, ఇండియా

ప్రసిద్ధిగాంచిన బిస్కత్తు నిర్మాతలు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

భూమిపై ఏ ఇతర జంతువూ చేయలేని ఒక పనిని మానవుడు చేయగలుగుతున్నాడు: అదేమిటంటే, వాతావరణాన్ని తనకు అనుకూలంగా మార్చుకోవటం.

భూమిమీద నీటి చుక్కలేని ఎడారులున్నాయి; ఎండలూ, వర్షాలూ విపరీతంగా ఉండే ప్రాంతాలున్నాయి; లక్షలకొద్దీ ఏళ్లతరబడి మంచు కప్పి ఉన్న ప్రాంతాలున్నాయి. ఒక శీతోష్ణస్థితిలో జీవించగల జంతువు మరొక శీతోష్ణస్థితిలో జీవించలేదు. మనిషి ఒక్కడే సర్వత్రా జీవించ గలుగుతున్నాడు.

అయితే భూమిపైన సూక్ష్మక్రిములుకూడా జీవించలేని ప్రాంతం ఉన్నది. అది దక్షిణ ధృవప్రాంతం. ఆ ప్రాంతంలో రాత్రి అయిందంటే గడ్డకట్టిన నీరు సయితం నూరు డిగ్రీల చలికి గురిఅవుతుంది. అలాటి చలిలో మనుషులు దీర్ఘరాత్రిని వెళ్లబుచ్చారు. వారి విచిత్ర కథ ఈ సంచికలో ప్రారంభమవుతున్నది.



సంపుటి 25 : అగస్టు 1959 : సంచిక 2



CHITRA




ఈ భయంతోబాటు ద్రుపదుడికి ఒక పెద్ద చిక్కు వచ్చిపడింది. తనవారికికూడా శిఖండిగురించి నిజం తెలిసిపోయే పరిస్థితి ఏర్పడింది. వారిదగ్గిర తన పరువు నిలబెట్టుకోవటానికిగాను ద్రుపదుడు ఒక నాటకం ఆడాడు. ఆయన తన భార్య వద్దకు సపరివారంగా వెళ్ళి, "ఇప్పుడు చాలా పెద్ద చిక్కు వచ్చిపడింది. మన వియ్యంకుడు మన శిఖండి ఆడదని అపోహపడి, తనను మనం మోసంచేశామన్న సాకుతో మనమీదికి దండెత్తి వస్తున్నాడు. ఏమిటిదంతా ? నాకు కూడా మన శిఖండి పురుషుడు కాడా అన్న అనుమానం కలుగుతోంది. నిజం ఏమిటో నీకు తెలియకుండా ఉండదుగదా ! నేను పొరపాటున ఆ హిరణ్యవర్మకు అపచారం చెయ్యలేదుగదా !" అన్నాడు.

ద్రుపదుడి భార్య యుక్తిగా ద్రుపదుడి పరువు కాపాడింది. ఆమె తన భర్తతో, "మన శిఖండి ఆడపిల్ల అన్న సంగతి నిజమే, మహారాజా ! లేక లేక బిడ్డను కన్న నేను ఆడపిల్లను కన్నానంటే నా సవతులలో లోకువైపోతానన్న భయంతో మగపిల్లవాడు కలిగాడని బొంకాను. నామీద మీకు గల ప్రేమకొద్దీ నా మాటలు మీరు నమ్మారు, కొడుకుకు చెయ్యవలసిన కర్మకాండ యావత్తూ జరిపించేశారు, చివరకు హిరణ్యవర్మ కుమార్తెను తెచ్చి వివాహంకూడా చేశారు. ఈ రహస్యం ఇంత కాలానికి బయటపడింది !" అన్నది.

ద్రుపదుడు తన మంత్రులతో, "విన్నారు కదా ! ఇప్పుడు మనం ఏం చెయ్యాలి ?" అని అడిగాడు.

"మన నగరం సులువుగా శత్రువుకు లొంగేది కాదు. అయినా దానికి మరికొంత అదనపు రక్షణలు ఏర్పాటు చేద్దాం !" అన్నారు మంత్రులు.

అట్టమీది బొమ్మ

అయినా ద్రుపదుడికీ, ఆయన భార్యకూ యుద్ధభయమూ, బెంగా పట్టుకున్నాయి. తమకు యుద్ధభయం లేకుండా చేయమని ప్రార్థిస్తూ ద్రుపదుడూ, అయన భార్యా దేవతలను అర్చించారు.

తన మూలంగా ఎటువంటి ఘోర పరిస్థితి ఏర్పడినదీ, యుద్ధంగురించి తన తల్లిదండ్రులు ఎలా భయపడి చస్తున్నదీ శిఖండి గ్రహించింది. "వీరి దుఃఖం నేను చూడలేను. ఇంతకన్న ఆత్మహత్య మేలు!" అనుకుని ఆమె ఎవరికీ తెలియకుండా ఇల్లు విడిచి వెళ్ళిపోయి సమీపంలో ఉన్న అడవులలో ప్రవేశించింది.

ఆమె చేరిన అరణ్యం స్థూణాకర్ణుడనే యక్షరాజుది. ఆ యక్షుడు కుబేరుడి అనుచర వర్గంలోవాడు, చాలా బలవంతుడు. ఆయనకు వెరిచి ఆ అరణ్యంలో ఎవరూ ప్రవేశించరు.

అలాటి నిర్జనమైన వనంలో తిండీ తిప్పలూ లేకుండా కొన్నిరోజులు తిరిగిన మీదట శిఖండి తలవనితలంపుగా ఆ యక్షరాజు కంట పడటం తటస్థించింది.

ఆయన ఆమెతో, "అమ్మాయీ, ఈ అరణ్యంలో చేరి ఉపవాసాలు చేస్తున్న నీవెవరవు? నావల్ల ఏదైనా సహాయం కావాలంటే చెప్పు!" అన్నాడు.





"అయ్యా, నాకు మీరు కొంచెంకూడా సహాయం చెయ్యలేరు! నాబాధ ఒకరు ఆర్చేదీ, తీర్చేదీ కాదు!" అన్నది శిఖండి ఎంతో విచారంగా.

"అలా అనకు. నేను కుబేరుడి అనుచరుణ్ణి. నేను ఎవరికైనాసరే చెయ్యలేని సహాయమంటూ ఉండదు. ఇవ్వరానిది కోరినా నేను ఇస్తానని మాట ఇస్తున్నాను!" అన్నాడు యక్షుడు.

శిఖండి తన పెళ్లి విషయమూ, తన తండ్రిపైకి పిల్లనిచ్చిన మామగారు దండెత్తి వస్తున్న విషయమూ చెప్పేసి, "దేవా, మా మామగారు మా నగరాన్ని నాశనం చేసే లోపుగా చాతనైతే నన్ను మగవాణ్ణి చేయండి. ఆ విధంగాతప్ప; మరేవిధంగానూ మా కష్టం తీరబోదు," అన్నది.

యక్షుడు చిక్కులో పడ్డాడు. ఆయన కొంచెం ఆలోచించి, "అమ్మాయీ, ఏమైనా సరే అన్నమాట తప్పను. కొద్ది కాలంపాటు నీ స్త్రీత్వం నేను తీసుకుని, నా పురుషత్వం నీకిస్తాను. కాని నీ అక్కర తీరిపోయిన మరుక్షణం నీవు నా పురుషత్వాన్ని నాకు తిరిగి ఇచ్చేస్తానని మాత్రం ముందుగా మాట ఇయ్యి!" అన్నాడు.

"దేవా, ధన్యురాలిని! మా మామగారైన హిరణ్యవర్మ తన దేశానికి బయలుదేరి పోగానే మీ పురుషత్వం మీకు తప్పక తిరిగి ఇచ్చి, నా స్త్రీత్వం నేను తీసుకుంటాను!" అన్నది శిఖండి.

స్థూణాకర్ణుడు దివ్యశక్తులు కలవాడు కావటంచేత తన పురుషత్వం శిఖండి కిచ్చి, ఆమె స్త్రీత్వం తాను ధరించి తన ఇంటికి వెళ్లిపోయాడు.

ఇప్పుడు శిఖండి మగవాడు. అతను పురుషత్వంతో వెలిగిపోతూ తండ్రి ఇంటికి తిరిగివచ్చాడు. అతను తల్లి దండ్రులకు నమస్కారం చేసి జరిగిన సంగతి చెప్పే సరికి వారు పరమానంద భరితులయారు.

ఇక ద్రుపదుడు ఎక్కడలేని ధైర్యమూ తెచ్చుకుని, తన పైకి దండెత్తి వచ్చే హిరణ్యవర్మకు, "నా కుమారుడైన శిఖండి పురుషుడు కాడని మీకు ఏవిధమైన అనుమానంగాని ఉన్న పక్షంలో మీరే వచ్చి స్వయంగా నిజం తెలుసుకోవచ్చు!" అని కబురుచేశాడు.

ఈ వార్త విని హిరణ్యవర్మ పాంచాల దేశపు రాజధాని అయిన కాంపిల్య నగరానికి వచ్చి ఒక బ్రాహ్మణ్ణి ద్రుపదుడివద్దకు దూతగా పంపాడు.

ఆ బ్రాహ్మణుడు వచ్చి తమ రాజుగారి మాటలుగా ద్రుపదుడితో, "రాజాధమా, నీ కూతురికి నా కూతుర్ని భార్యగా చేసుకుని నన్ను మోసగించినందుకు ఫలం అనుభవించబోతున్నావులే!" అన్నాడు.

ద్రుపదుడు ఆ బ్రాహ్మణుడికి అర్ఘ్యమూ, గోవూ ఇవ్వబోయాడు. కాని ఆ బ్రాహ్మణుడు వాటిని నిరాకరించాడు. ఆయనను సాగనంపి ద్రుపదుడు హిరణ్యవర్మవద్దకు తానే ఒక బ్రాహ్మణ్ణి పంపాడు. ఆ బ్రాహ్మణుడు హిరణ్యవర్మవద్దకు వెళ్లి, "మహారాజా, మా రాజుగారు మీతో ఇలా చెప్పమన్నారు: "మా శిఖండి పురుషుడు కాడని మీతో ఎవరో అసత్యాలు చెప్పారు. అతను వాస్తవంగా పురుషుడే! మీరు నిరభ్యంతరంగా మా





గృహానికి వచ్చి, యిందులోవున్న నిజం గ్రహించండి!" అన్నాడు.

హిరణ్యవర్మ నిజం తెలుసుకు రావటానికి కొందరు మనుషులను ద్రుపదుడి ఇంటికి పంపాడు.

వారు కొన్ని దినాలకు తిరిగివచ్చి హిరణ్యవర్మతో శిఖండి స్త్రీ కాదనీ, పురుషుడేననీ తేల్చి చెప్పారు.

హిరణ్యవర్మ ఆగ్రహమంతా మటుమాయమై అంతులేని ఆనందం కలిగింది. శత్రువుగా వచ్చినవాడు కాస్తా ద్రుపదుడికి అతిథిగా మారి, తన వియ్యంకుడు చేసిన సత్కారాలన్నీ స్వీకరించి, తన అల్లుడికి అంతులేని డబ్బూ, గుర్రాలూ, ఏనుగులూ, ఆవులూ, అందగత్తెలైన వెయ్యిమంది దాసీలనూ బహూకరించి తృప్తిగా ఇంటికి తిరిగి వెళ్లాడు.

ఇక్కడ శిఖండి తాత్కాలిక సమస్య పరిష్కారమయేలోపుగా అక్కడ యక్షుడికి తీరని కష్టం వచ్చిపడింది. ఒకనాడు తలవని తలంపుగా కుబేరుడు తన విమానంలో సపరివారంగా వచ్చి వనంలోవున్న యక్షుడి ఇంటి పైభాగాన దిగాడు.

తాను వచ్చి ఎంతసేపైనా కూడా స్థూణాకర్ణుడు తనకు స్వాగతం చెప్పటానికి రాకపోవటం కుబేరుడికి విడ్డూరంగా కనిపించింది. అప్పుడు ఆయనకు, స్థూణాకర్ణుడు ద్రుపదుడనే పాంచాలరాజు కుమార్తెకు తన పురుషత్వం ఇచ్చి తాత్కాలికంగా తాను ఆమె స్త్రీత్వం ధరించి ఉన్నాడనీ, ఆ రూపంలో తన యజమాని ఎదటికి రావటానికి సిగ్గుపడుతున్నాడనీ తెలిసింది.

"దుర్మార్గుడు, ఏం పని చేశాడూ! వాణ్ణి తక్షణం నా వద్దకు తీసుకురండి!" అని కుబేరుడు తన పరివారంలోని యక్షులను ఆజ్ఞాపించాడు. స్త్రీ రూపంలో ఉన్న యక్షుడు కుబేరుడు సమక్షానికి వచ్చి సిగ్గుతో తలవంచుకుని నిలబడ్డాడు.

కుబేరుడు యక్షుణ్ణి చూసి మరింత కోపం వచ్చినవాడై, "నీచుడా, ఏ మాత్రమూ విచక్షణ లేక ఎవతెకో నీ పురుషత్వం ఇచ్చేసి, ఆమె స్త్రీత్వం స్వీకరిస్తావా? ఎప్పటికీ స్త్రీవి గానే ఉండిపో! ఆ స్త్రీని శాశ్వతంగా మగ వాడుగా ఉండనీ! ఇదే నీకు శిక్ష!" అని శపించాడు.

మిగిలిన యక్షులు తమ సాటి యక్షుణ్ణి చూసి జాలిపడి శాపానికి పరిహారం ఏదన్నా చెప్పమని కుబేరుణ్ణి ప్రార్థేయపడ్డారు. కుబేరుడు కనికరించి, శిఖండి చనిపోయినాక యక్షుడికి పురుషత్వ ప్రాప్తి కలిగేలాగు అనుమతించాడు. తరవాత కుబేరుడూ, ఆయన వెంటవచ్చిన పరివారమూ విమానంలో వెళ్ళిపోయారు.

తన మామగారు తిరిగిపోగానే శిఖండి అన్నప్రకారం యక్షుడున్న చోటికి వచ్చి, "మహాత్మా, నీ ధర్మాన మా ఆపద గడిచింది. మీ పురుషత్వం మీరు తీసుకుని నా స్త్రీత్వం నాకివ్వండి!" అన్నాడు.

యక్షుడు శిఖండితో జరిగిన సంగతి అంతా చెప్పి, "నీవు బతికిఉన్నంత కాలమూ నా పురుషత్వం ధరించి సుఖంగా జీవించు. అన్న మాటప్రకారం నా పురుషత్వం నాకివ్వటానికి తిరిగి వచ్చినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. నేను కిందటి



జన్మలో ఏదో పాపం చేసుకుని ఉండటంవల్ల ఇలా జరిగి ఉంటుంది. లేకపోతే నేను స్త్రీగా ఉన్న సమయంలోనే పరీక్షగా కుబేరుడు నన్ను చూడరావాలా?" అన్నాడు ఎంతో విచారపడుతూ.

శిఖండి యక్షుడికి ప్రణామంచేసి పరమానందంతో ఇంటికి తిరిగి వెళ్ళి, దేవతలను ఆరాధించి, బ్రాహ్మణులకు ధన కనక వస్తు వాహనాదులు దానాలు చేశాడు. ఇక ద్రుపదుడి సంతోషానికి మేర లేనేలేదు. ఆయన శిఖండినీ, ధృష్టద్యుమ్నుణ్ణీ ద్రోణుడి వద్ద శిష్యులుగా ఉంచి వారికి విలువిద్య నేర్పించాడు.

వారు ద్రోణశిష్యులై ధనుర్వేదం నాలుగు పాదాలూ పూర్తిగా అభ్యసించారు.

భీష్ముడు ఈ కథ యావత్తూ దుర్యోధనుడికి చెప్పి, "నాయనా, నేనీ రహస్యాలన్నీ నా వేగులవాళ్ళద్వారా తెలుసుకున్నాను. వారు మందమతులుగానూ, చెవిటివాళ్ళుగానూ, వికలాంగులుగానూ నటించుతూ ద్రుపదుడి నగరంలో ఉండి జరిగిన ప్రతి సంగతీ నాకు తెలుపుతూ వచ్చారు. శివుడి వరంవల్ల అంబ శిఖండి జన్మ ఎత్తి కొంతకాలం స్త్రీగా ఉండి ఇప్పుడు పురుషరూపం ధరించింది. ఇతడు యుద్ధభూమిలో నాకు ఎదురైతే అతనికేసి చూడనైనా చూడను, అతనితో యుద్ధం చెయ్యను, అతనిని చంపను. స్త్రీతోగాని, ఒకప్పుడు స్త్రీగా ఉండిన పురుషుడితోగాని, స్త్రీల పేరు పెట్టుకున్నవాడితోగాని, స్త్రీల మాదిరిగా మసులుకునేవాడితోగాని యుద్ధం చెయ్యరాదని నేను నియమం పెట్టుకున్నాను; ఆ సంగతి లోకానికంతకూ తెలుసు. భీష్ముడు ఆడదాన్ని చంపాడంటే అది ఎంత అప్రతిష్ఠ!" అన్నాడు.

దుర్యోధనుడుకూడా బాగా ఆలోచించి ఆయనకు అలాటి నియమం ఉండటం సమంజసమే ననుకున్నాడు.






## 14

[చంద్రవర్మ కొంత దిగువనున్న ఒక పూరిగుడిసె దగ్గిరకు వెళ్ళాడు. అక్కడ ఒక ముసలివాడు తటస్థపడి, మొదట చంద్రవర్మను రాజభటుడుగా అనుమానించి, తరవాత నిజం తెలుసుకుని, తనదగ్గిర కంచుకోటకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం వున్నదని అతడితో చెప్పాడు. అంతలో రాజభటులు వచ్చారు. ముసలివాడు పారిపోయాడు. గుడిసెలో చిక్కుకుపోయిన చంద్రవర్మను వాళ్లు బయటికి రమ్మన్నారు. తరవాత—]

చంద్రవర్మ గుడిసెలోంచి బయటికి రావటం చూస్తూనే, రాజభటులు నివ్వెరపోయారు. వాళ్లు ముసలివాణ్ణి ఎరుగుదురు. ఇంత కాలానికి అతడు తమ చేతిలో చిక్కిపోయాడనీ, వాణ్ణి రాజుదగ్గిరకు పెడరెక్కలు విరిచి కట్టి లాక్కుపోతే, తమకు ఆయన గొప్ప బహుమానం యిస్తాడనీ వాళ్లు ఆశించారు. కాని, అక్కడ చంద్రవర్మ కనిపించేసరికి, "నువ్వెవరు? ముసలివాడెక్కడ?" అంటూ భటుల నాయకుడు కత్తి దూసి కళ్లెర్రచేస్తూ అతడిమీదికి వచ్చాడు.

"మీరు అనే ముసలివాడెవడో నాకు తెలియదు. పోతే, నేనెవరో మీకు చెప్పే ముందు, మీరెవరో నాకు తెలియాలి," అన్నాడు చంద్రవర్మ కత్తిదూస్తూ.

చంద్రవర్మ నిర్భయంగా నిలబడిన తీరూ, కత్తి దూయటంలో అతడు కనబరిచిన ఒడుపూ చూస్తూనే, భటుల నాయకుడు






ఒక క్షణకాలం నిశ్చేష్టుడయాడు. అది అదనుగా తీసుకుని చంద్రవర్మ, "మీరెవరో, ఏరాజు సేవకులో నాకు తక్షణం తెలియ పరచాలి. నన్ను చుట్టుముట్టి హతమార్చే ప్రయత్నం చేయదలిస్తే, అది మీ నాశనానికి దారి తీస్తుంది. నాకు వెనక రక్షణగా గుడిసె గోడ అడ్డం వున్నది. ఆ వైపునుంచి నన్ను మీరు ఎదుర్కోలేరు. కనుక, నాతో మీరు ఒక్కరొక్కరుగానే పోరాడవలసివుంటుంది. ఇదుగో, కత్తిదెబ్బ కాచుకోండి!" అంటూ చంద్రవర్మ ఒక అడుగు ముందుకు వేశాడు.

చంద్రవర్మ చెప్పినదంతా యదార్థమని ఒక్క తృటికాలంలో భటుల నాయకుడు గ్రహించాడు. అతణ్ణి చుట్టుముట్టే ప్రయత్నం వృథా. అలా కాక ముఖాముఖి యుద్ధానికి తలపడితే తమలో ఒక్కొకరినే అతడు యమపురికి పంపగలడు. అతడి వాలకం చూస్తే, ఆరితేరిన యోధుడులా కనిపిస్తున్నాడు.

"అయ్యా, తమరెవరో మహాయోధుల్లా వున్నారు. అలాటి మీకూ, తోటి యోధుడనైన నాకూ అనవసరంగా ఈ కలహం ఎందుకు? నేను రాజాజ్ఞ పొంది ఒకానొక ముసలివాడి కోసం ఈ అడవినంతా గాలిస్తున్నాను. హఠాత్తుగా మీరు తటస్థపడ్డారు. జరిగిందేదో జరిగింది; యిప్పుడు ఎవరి మార్గాన వాళ్ళం పోదాం," అన్నాడు భటుల నాయకుడు రాజీమార్గంగా.

తన ఎత్తుగడ పారినందుకు చంద్రవర్మ లోలోపల చాలా సంతోషించాడు. కాని, బయటికి ఎక్కడ లేని కరుకుదనం కన బరుస్తూ, "మీ రాజెవరు?" అని అడిగాడు.

"మా రాజెవరో మీకు తెలియదా? మీరు ఏ రాజ్యపు హద్దుల్లో వున్నారో, ఆ రాజ్యపు పాలకుడి పేరు తెలియదనటం ఆశ్చర్యంగా వున్నది!" అన్నాడు భటుల నాయకుడు.

చంద్రవర్మ ఆ మాటలకు నవ్వి, "రాజ్యాలూ, వాటి సరిహద్దులూ గుర్తిం





చటం నేనేనాడో మరిచిపోయాను. మా గురువు మరణించే ముందు నన్ను ఒక రాజును చూడవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ రాజు పేరు శివసింహుడు. ఆయనను కలుసుకునేందుకు నేను భరతఖండం ఆ చివరినుంచి యీచివరకూ, యీచివరి నుంచి ఆ చివరకూ తిరుగుతున్నాను. ఆ సందర్భంలో నేనిక్కడ మీకంట బడటం జరిగింది. ఇక మీదారిన మీరు వెళ్ల వచ్చు!" అంటూ గిరుక్కున వెను దిరగబోయాడు.



చంద్రవర్మ మాటలు వింటూనే రాజ భటులూ, వారి నాయకుడూ ఆశ్చర్యచకితు లయారు. వెనుదిరిగి గుడిశెలోకి వెళ్లబోతు న్నట్టు నటించిన చంద్రవర్మను, భటుల నాయకుడు వారిస్తూ. "అయ్యా! మీరెవరో అపూర్వ పురుషుల్లా వున్నారు! మీ గురువు గారు ఏ రాజునైతే కలుసుకోమన్నారో—ఆ రాజు శివసింహుడే; యీ ప్రాంతాలకు పరి పాలకుడు," అన్నాడు.

చంద్రవర్మ ఎక్కడ లేని ఆశ్చర్యం కన బరుస్తూ, "ధన్యుణ్ణి, ధన్యుణ్ణి! ఆహా, ఎంత కాలానికి నాప్రయాస ఫలించింది. గురువాజ్ఞ నెరవేరదని భయపడ్డాను. పదండి, పదండి! తక్షణం శివసింహ మహా రాజులుంవారి దర్శనం చేసుకోవాలి!" అన్నాడు భటులను వేగిరపరుస్తూ.

భటుల నాయకుడు తన అనుచరులకేసి ఓమారు చూసి, తరవాత అనుమానంగా చంద్రవర్మకేసి చూస్తూ, "అయ్యా, మీ గురువుగారు మిమ్మల్ని, మా రాజుగారి దర్శనం చేయుమని ఎందుకు చెప్పారు?" అని అడిగాడు.

"అది పరమ రహస్యం; దేవరహస్యం కన్నకూడా నిగూఢమైంది," అంటూ చంద్ర వర్మ ఆకాశంకేసి తల ఎత్తి, "ఆహాఁ, కంచుకోటా! నా గుప్పెట చిక్కావుగదా?" అన్నాడు బిగ్గరగా.



'కంచుకోట' అన్న వాక్యం వింటూనే భటుల నాయకుడు తుళ్లిపడి, "అయ్యా, మీకా కంచుకోట సంగతి ఎలా తెలుసు?" అని అడిగాడు.

"ఆ కంచుకోటగురించి నాకూ, నా గురువుకుమాత్రమే తెలుసు. కాని, నువ్వు ప్రశ్నించిన తీరుచూస్తూంటే, నీకూ దాన్ని గురించి కొద్దో గొప్పో తెలిసినట్టు కనబడుతున్నది. వింత! ఆశ్చర్యం!" అంటూ చంద్రవర్మ విస్తుపోయాడు.

"ఇందులో ఆశ్చర్యం ఏం వున్నది! ఆ కంచుకోటను గురించిన ఒకానొక రహస్యం తెలుసుకునేందుకే, మేమీ అడవిలో ఒక



జిత్తులమారి ముసలివాడికోసం గాలిస్తున్నాం," అన్నాడు భటుల నాయకుడు.

చంద్రవర్మ చప్పున తన కుడి అరిచేతికేసి ఓక్షణకాలం తీక్షణంగా చూసి, "ఆఁ యిప్పుడు అంతా తెలిసింది! ఆ ముసలివాడి దగ్గిర కంచుకోటకు వెళ్లే మార్గాన్ని సూచించే పటం వున్నదని మీరాజు అనుమానిస్తున్నాడు. ఆ ముసలివాడి కొడుకు దేవలుడనేవాణ్ణి కారాగారంలో బంధించాడు. అవునా? మీ రాజెంత అమాయకుడు!" అన్నాడు.

భటుల నాయకుడు చంద్రవర్మ చేతికేసి పరీక్షగా చూసి, "అయ్యా, మీరు సర్వజ్ఞుల్లా వున్నారు! మీ అరిచేతిలో యీ వివరాలన్నీ కనబడటం ఆశ్చర్యంగా వున్నది," అన్నాడు.

"ఎవరి కాశ్చర్యం? నీకా, నాకా?" అంటూ చంద్రవర్మ కోపంగా భటుల నాయకుడికేసి చూసి, "మీరు తక్షణం యిక్కణ్ణించి కదిలి, ఆ రాళ్లగుట్ట వెనక వున్న పల్లంలో నాకోసం వేచివుండండి నేను కొద్ది క్షణాల్లో అక్కడికి వస్తాను. తరవాత అందరం కలిసి మీ రాజుదగ్గిరకు పోదాం. తెలిసిందా?" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

చంద్రవర్మదగ్గిర ఏవో అపూర్వ శక్తులున్నవని భ్రమపడిన భటుల నాయకుడు,







'చిత్రం, చిత్రం!' అంటూ తన అనుచరులతో గుట్టవెనక వున్న ప్రదేశానికి వెళ్లిపోయాడు. వాళ్లు గుట్టవెనక కనపడకుండా పోగానే, చంద్రవర్మ బయలుదేరి అల్లంత దూరంలో వున్న చెట్లల్లోకి పోయి, "అంతా మాట్లాడాను! దేవలుడికి ప్రమాదం లేదు. ఎక్కడున్నావు జాంబవంతా?" అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే ముసలివాడు చెట్లలోంచి బయటికి వచ్చి, చంద్రవర్మను సమీపిస్తూ "జాంబవంతు డెవరు?" అని అడిగాడు.

"నువ్వే జాంబవంతుడివి! ముసలి వాడా, అని కేకవెయ్యటం బావుండదని అలా పిలిచాను. నేను శివసింహుడి దగ్గిరకు వెళుతున్నాను. నీ కొడుకు దేవలుణ్ణి చెర నుంచి విడిపించటమే గాక, నీకు కంచు కోటలో దొరికే ధనరాసుల్లో భాగంకూడా యిప్పిస్తాను. అక్కడికి వెళ్లేమార్గాన్ని తెలిపే పటం ఎక్కడ?" అన్నాడు చంద్రవర్మ.

"నీ మాటలు నమ్మవచ్చునా?" అన్నాడు ముసలివాడు అనుమానంగా.

"నమ్మక నువ్వు చేయగలిగిందేమిటి? నమ్మితే నీకూ, నీకొడుక్కూ క్షేమం కలుగుతుంది. పడమటి సముద్రతీరంలో కంచు కోట వున్నదని తెలిసింతరవాత అక్కడికి చేరటం ఒక సమస్య కాదు. సముద్రతీరం వెంట వెళితే ఎప్పుడో ఒకప్పుడు అక్కడికి చేరకపోను. పోతే, నీదగ్గిరవున్న పటం చూసినందువల్ల, అక్కడికి వెళ్లేందుకు దగ్గిర మార్గంగాని, సులభమార్గంగాని కనబడ వచ్చునని ఆశపడుతున్నాను," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ యిలా అనేసరికి ముసలి వాడు కిక్కురుమనకుండా తన దుస్తుల్లో దాచివున్న ఒక పెద్ద తాళపత్రపు కవిలె బయటికి తీసి, దాన్ని విసనకర్రలా గుండ్రంగా విప్పుతూ చంద్రవర్మతో, "ఇదుగో, కంచుకోటకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం!" అన్నాడు.





"ఈ కంచుకోటను మా పూర్వుల్లో ఒకరు చూశారు. నేను ముసలివాణ్ణయాను కాని, లేకపోతే నేను ఒంటరిగానే అక్కడికి వెళ్లివుందును," అన్నాడు ముసలివాడు.

ముసలివాడి మాటలకు చంద్రవర్మ నవ్వి, "సరే, యీ పటం నాకిచ్చెయ్యి. నేనే స్వయంగా యీ కంచుకోటను వెతుక్కుంటూ వెళతాను. నీ కొడుకు దేవలుణ్ణి కూడా వెంట తీసుకుపోతాను. నువ్వు ఆ గుడిశెలో క్షేమంగా వుండవచ్చును. రుద్రపురంరాజైన శివసింహుడితో అన్ని సంగతులూ మాట్లాడి, నేనూ, నీ కుమారుడూ తిరిగి వచ్చేవరకూ, నీకు అన్ని వసతులూ సరిగా వుండే ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

ముసలివాడు అయిష్టంగా తన చేతిలోని పటాన్ని చంద్రవర్మకు యిస్తూ, "ఇందులో మోసం ఏమీ లేదుగదా? ముసలివాణ్ణి మోసగించటం మహాపాపం!" అన్నాడు.

"నిన్నూ, నీ కొడుకునూ నేను మోసగించను. రాజు శివసింహుణ్ణికూడా.....అతడు సన్మార్గవర్తి అయితే నేను మోసగించబోవటంలేదు. అలాకాక........"

చంద్రవర్మ మాట ముగించకముందే అతడికి పెద్దగా గుర్రం సకిలించిన ధ్వని వినబడింది. అతడు చెట్లలోంచి గుట్టకేసి

చంద్రవర్మ ఆ పటాన్ని ఎంతో శ్రద్ధగా పరిశీలించి చూశాడు. అందులో కొండలూ, అడవులూ, నదులూ, ఎడారులూ స్పష్టంగా చిత్రించబడివున్నవి. సముద్రం చిత్రించబడిన చోటుకు అనుకుని ఎత్తయిన గోడలతో ఒక కోట కనబడుతున్నది. ఆ కోట గోడలమీదుగా కనిపిస్తున్న పెద్ద భవనాలను పొగలాటిదేదో కమ్ముకుని వున్నది.

చంద్రవర్మ తనలో రేకెత్తిన భయాందోళనలను తొక్కిపడుతూ. "ఈ అడవులూ, నదులూ, ఎడారులూ దాటి మానవమాత్రుడెవడైనా అక్కడికి చేరటం సాధ్యమేనా?" అని తనను తాను ప్రశ్నించుకున్నాడు.





తొంగిచూశాడు. రాజభటుల నాయకుడు తన గుర్రాన్ని గుట్టమీదుగా ఎక్కించి. గుడిసె వున్న చోటుకు వస్తున్నాడు. అది చూస్తూనే చంద్రవర్మ, ముసలివాడికేసి తిరిగి, "నేను రాజభటుల్ని వెంటపెట్టుకుని రుద్రపురం వెళ్లి రాజును కలుసుకుంటాను. నువ్వు ప్రస్తుతానికి నీ గుడిసెలో వుండవచ్చు. నేను త్వరలోనే నీకోసం కబురు చేస్తాను. అప్పుడు నువ్వు నగరానికి వచ్చి, అక్కడే హాయిగా జీవించవచ్చు," అంటూ భటుల నాయకుడికి ఎదురువెళ్లాడు.

చంద్రవర్మ తనను సమీపిస్తుండటం చూసి భటుల నాయకుడు గుర్రాన్ని దిగుతూ, "అయ్యా, తమరు ఎంతకూ రాకపోయేసరికి, నేనే బయలుదేరి వస్తున్నాను. ఈ గుర్రం తమకోసమే! మీరు నగరానికి వస్తున్నట్టు రాజుగారికి వార్త పంపాను," అన్నాడు.

"నేను కొన్ని శక్తులను ఆవాహన చేసేందుకు అడవిలోకి వెళ్లాను. మీరాజును గురించి వాటిలో ఏ ఒకటీ ఒక్క మంచి మాట చెప్పకపోవటం నాకు ఆశ్చర్యంగా వున్నది. మీరాజు అంత దుష్టుడా?" అని అడిగాడు చంద్రవర్మ.

"అయ్యా, రాజు దుష్టుడో మంచివాడో అతడి సేవకులకెలా తెలుస్తుంది? ఆ సంగతి ప్రజలకూ, పొరుగు రాజులకూ తెలియాలి. మాకు కావలసిందల్లా నెలనెలా భత్యాలు సరిగా ముట్టటం. అవి ముట్టచెప్పినవాడు మంచిరాజు; ముట్టచెప్పనివాడు చెడ్డరాజు!" అన్నాడు భటుల నాయకుడు.

ఆ మాటలతో చంద్రవర్మకు తను శివసింహుడి దగ్గిర ఎంతో మెలకువతో మెలగవలసివుంటుందని అర్థమైపోయింది. కంచు కోటను చేరాలంటే తనకు కొంత బలగం కావాలి. అది శివసింహుడిలాంటి రాజువల్లనే తనకు లభ్యమవుతుంది. ఒంటరిగా కంచు కోటను చేరాలని చూడటం ఆత్మహత్యతో సమానం. మార్గంలో అనేక ఘోరప్రమా





దాలను ఎదుర్కొనవలసి వుంటుంది గనకనే, అక్కడికి వెళ్ళేందుకు ఎవరూ ప్రయత్నించటం లేదని చంద్రవర్మ గ్రహించాడు. పోతే, శివసింహుడికి తనను గురించిన నిజం చెప్పుకోవటం మహాప్రమాదం కావచ్చు. రాజభటులను నమ్మించినట్టే, అతడినీ తను గొప్ప మంత్రశక్తులు గల వాడినని నమ్మించాలి!

"అయ్యా, ఇక మనం నగరానికి బయలు దేరదామా?" అంటూ భటుల నాయకుడు గుర్రాన్ని చంద్రవర్మ పక్కకు అదిలించాడు. చంద్రవర్మ కళ్లెం అందుకుని గుర్రంమీద ఎక్కి కూచున్నాడు.

కొంతదూరం అడవిలోనూ, కొంతదూరం కొండ కనుమలవెంటా ప్రయాణించి చంద్రవర్మా, రాజభటులూ రెండుగంటల తరవాత రుద్రపురం చేరారు. నగరద్వారాలూ, వీధులూ తోరణాలతో అలంకరింపబడి వున్నవి. రాజమార్గానికి యిరువైపులా సోలుపులుగా నగరవాసులు నిలబడి వున్నారు. రాజభటులతో కలిసి, చంద్రవర్మ రాజమార్గంమీదికి వచ్చేసరికి ప్రజల్లోనుంచి కరతాళధ్వనులూ, మహా మాంత్రికుడికీ జై! అన్న కేకలూ వినిపించినై.

ఆ జేజేలు వింటూనే చంద్రవర్మ తికమక పడిపోయాడు. తను మహామాంత్రికుడా? ఇది చాలావింతగా వున్నదే అనుకున్నాడతడు. అంతలో అతడికి భటులనాయకుడు చెప్పిన మాటలు గుర్తుకొచ్చినై. తను అరిచేతిని పరీక్షగా చూసుకుని, ముసలివాణ్ణి గురించీ, కంచుకోటకు వెళ్లేమార్గాన్ని తెలిపే పటాన్ని గురించీ అన్నమాటలు, భటులనాయకుడికి అద్భుతంగా కనిపించివుంటవి. ఆ కారణంగా అతడు రాజుకు తను గొప్ప మాంత్రికుడని వార్త పంపివుంటాడు. తనను యిలాంటి మర్యాదలతో, ముఖస్తుతులతో లోబరుచుకునేందుకు రాజు ఈ అర్భాటాలన్నీ ఏర్పాటుచేశాడు! —(ఇంకా వుంది)





# గయ్యాళికి గర్వభంగం

పడూవా నగరంలో బాప్టిస్టా అనే ధనికుడైన వర్తకుడుండేవాడు. ఆయన పెద్ద కుమార్తె కేథరిన్ పరమగయ్యాళి. ఆమెకు పట్టరాని కోపమూ, వల్లమాలిన నోటిదురుసూ ఉండేది. అందుచేత ఆమెను అందరూ గయ్యాళి కేథరిన్ అనేవారు. అటువంటి ఆడదాన్ని ఎవరు పెళ్లాడతారు? బాప్టిస్టా చిన్నకూతురు బియాంకా ఎంతో సాత్వికురాలు. ఆమెను పెళ్లాడటానికి ఎందరో యువకులు ఎగబడుతున్నప్పటికీ, పెద్దదానికి పెళ్లి అయితేనేగాని చిన్నదానికి చెయ్యనని తండ్రి భీష్మించాడు. ఇందుకు ఆయనను అందరూ తప్పుపట్టారు.

ఇలా ఉండగా పడూవా నగరానికి పెట్రూషియో అనేవాడు కన్యను వెతుకుతూ వచ్చాడు. అతను కేథరిన్ గురించి విన్నాడు. ఆమె అందగత్తె అనీ, ధనవంతురాలనీ తెలుసుకున్నాడు. ఆమె గయ్యాళితనాన్ని లక్ష్యపెట్టకుండా పెళ్లాడినాక ఆమెను పిల్లిలాగా చేయ నిశ్చయించుకున్నాడు.

పెట్రూషియో అంతపనీ చెయ్యగల సమర్థుడే. అతనుకూడా కేథరిన్‌లాగే గడుసువాడు, మాటకారి, మీదు మిక్కిలి వివేకం గలవాడు. అందుచేత లోపల కోపం లేకపోయినా పైకి దారుణమైన కోపం ఉన్నట్టు అభినయించగలిగేవాడు.

అతను ముందుగా బాప్టిస్టావద్దకు వెళ్లి, "అయ్యా, మీ కుమార్తె అయిన కేథరిన్ చాలా సౌమ్యురాలనీ, బిడియం గలది అనీ విని ఆమెను పెళ్లాడే ఉద్దేశంతో వెరోనా నగరం నుంచి వచ్చాను," అన్నాడు.

తన పెద్దకూతురికి వరుడు వచ్చాడని తండ్రి సంతోషించాడు గాని ఆ వరుడు చేసిన వర్ణన తన పెద్దకూతురికి అతకకపోవటం ఆయన గుర్తించాడు. సరిగా ఈ సమయానికే కేథరిన్‌కు సంగీతం చెప్పే

విలియం షేక్స్పియర్

పెద్దమనిషి వచ్చి బాప్టిస్టాతో, "అయ్యా, నేను సరిగా పాడమన్నానని కోపంవచ్చి మీ పెద్దమ్మాయి వాద్యాన్ని నా నెత్తిన కొట్టి విరగగొట్టింది!" అని ఫిర్యాదుచేశాడు.

"ఆహా, ఎంత ధీరురాలు! ఆమెతో నేను చాలా సేపు ప్రసంగించాలి," అన్నాడు పెట్రూషియో. అతను బాప్టిస్టాతో, "అయ్యా, నాకు వేరే పనులున్నాయి. పెళ్లి నిర్ణయం త్వరగా జరగాలి. మీరు మా తండ్రిగారి నెరుగుదురు. ఆయన పోయాక ఆయన ఆస్తి కంతకూ నేనే వారసుణ్ణి అయాను. మీ అమ్మాయి నన్ను పెళ్లాడే పక్షంలో ఏపాటి కట్నమిచ్చుకుంటారు?" అన్నాడు.

పెళ్లి సమయంలో పెళ్లికూతురికి ఇరవై వేలు చదివిస్తాననీ, తన మరణానంతరం తన ఆస్తిలో సగం ఆమెకే చెందుతుందనీ వృద్ధుడు పెట్రూషియోకు సమాధానం చెప్పాడు. తరవాత ఆయన వెళ్లి తన పెద్ద కుమార్తెను పంపాడు.

వెంటనే ఇద్దరికీ వాగ్యుద్ధం ప్రారంభ మయింది. కేథరిన్ నోటికివచ్చినట్టల్లా మాట్లాడేసింది. పెట్రూషియో ఆమెకు తీసి పోకుండా మాటకుమాట అంటూనే, "నువు నిజంగా ఎంత మెతకమనిషివి! నిన్ను గురించి ఎందరో అబద్ధాలు చెప్పారు, గయ్యాళివన్నారు, కుంటిగా నడుస్తా



వన్నారు! అన్నీ అబద్ధాలు! మీ నాన్న కూడా ఒప్పుకున్నాడు, అంతా స్థిరమై పోయింది, వచ్చే ఆదివారం రోజున మన పెళ్లి!" అన్నాడు.

ఇంతలోనే బాప్టిస్టా వచ్చి, "అమ్మాయి ఏమంటుంది? పెళ్లికి ఒప్పుకున్నదా?" అని అడిగాడు. ఒప్పుకున్నదన్నాడు పెట్రూషియో.

కేథరిన్ మండిపడి, "ఈ బుర్రలేని వెర్రివాణ్ణా పెళ్లాడటం?" అన్నది.

ఈ మాట వినగానే ముసలాయన పెట్రూషియోతో, "పెళ్లికి ఒప్పుకున్న దంటావేం?" అన్నాడు.

"ఇదొక సరసం! మీ ఎదట అలా మాట్లాడుతున్నదిగాని నాతో చాలా అపేక్షగా మాట్లాడింది. ఆదివారంనాడు పెళ్లికూడా నిశ్చయించాం... కేథరిన్, మనంవెళ్లి పెళ్లి బట్టలూ అవీ కొనుక్కువద్దాం పద!" అన్నాడు పెట్రూషియో.

ఆ మాట విన్నాక బాప్టిస్టాకు నమ్మకం కుదిరింది. పెళ్లి ప్రయత్నాలు జరిగాయి. ఆదివారంనాడు పెళ్లి చూడటానికి అతిథు లందరూ హాజరయారు. కాని పెళ్లికొడుకు జాడ లేదు. పెట్రూషియో తనను పరాభ వించటానికి ఇంతా చేశాడనుకుని కేథరిన్ కంట తడిపెట్టుకున్నది.





చివరకు పెట్రూషియో రానేవచ్చాడు. అయితే అతను పెళ్లికొడుకు దుస్తులు ధరించక అర్థంలేని ఉడుపులేవో ధరించి ఉన్నాడు. కేథరిన్ కోసం తెస్తానని మాట ఇచ్చిన బట్టలూ అవీ తీసుకురాలేదు. అతని వెంట అతని నౌకరుకూడా ఉన్నాడు. ఇద్దరూ వికృతంగా అలంకరించిన గుర్రాలెక్కివచ్చారు.

"ఇవేం దుస్తులు? ఇవి మార్చుకు రా, పెళ్లికూతురు వేచి ఉన్నది!" అని బాప్టిస్టా అంటే, పెట్రూషియో మకురుతనంగా, "నా భార్య నన్ను పెళ్లాడుతుందా? నా దుస్తులను పెళ్లాడుతుందా?" అని అడిగాడు.

అతను పెళ్లి బృందంతోపాటు అవే దుస్తులతో చర్చికి వెళ్లాడు. అక్కడ వారిద్దరికీ పెళ్లిచేసే పురోహితుడు పెళ్లికూతుర్ని, "ఇతనిని పెళ్లాడటం నీకు సమ్మతమేనా?" అని అడిగినప్పుడు, పెట్రూషియో, "ఎందుకు సమ్మతం కాదు?" అని రంకె పెట్టి పురోహితుణ్ణి ఒక్కతన్ను తన్నాడు. అతని దౌర్జన్యం చూసి కేథరిన్ వణికిపోయింది.

ఇదంతా ఒక నాటకం. కేథరిన్‌ను దారికి తీసుకురావటానికి పెట్రూషియో ఇలాటి అఘాయిత్యాలు చాలా చేశాడు.

పెళ్లి అనంతరం బాప్టిస్టా ఒక పెద్ద విందు ఏర్పాటుచేశాడు. కాని పెట్రూషియో ఒక క్షణంకూడా తాను నిలవటానికి లేదనీ, తానూ తన భార్యా వెంటనే బయలుదేరాలనీ పట్టుపట్టాడు; ఎవరెంత చెప్పినా వినలేదు.

పెట్రూషియో, కేథరిన్, నౌకరూ గుర్రాలెక్కి అతని ఇంటికి బయలుదేరారు. కేథరిన్ ఎక్కిన గుర్రం ముసలితట్టు, నడవలేదు. అది తొట్రుపడినప్పుడల్లా అతను నోటికి వచ్చినట్టు తిట్టాడు. చిట్టచివరకు భార్యాభర్తలు ఇంటికి చేరుకున్నారు. పెట్రూషియో తన ఇల్లాలికి ఎంతో ప్రేమతో స్వాగతం చెప్పాడు.

కాని అతను అమెను తిండి తిననివ్వ దలచలేదు, విశ్రాంతి తీసుకోనివ్వదలచ లేదు. అతని నౌకర్లు అతనికోసం రకరకాల వంటకాలతో విందుచేశారు. కాని పెట్రూషియో ఒక్కటీ బాగా లేదని, వడ్డించినవన్నీ గిరవాటువేసి, నౌకర్లను తిట్టాడు. "నా భార్యకు ఇటువంటి అర్థంలేని పదార్థాలు పెడతారా ?" అని గదమాయించాడు.

అసలే ప్రయాణపు బడలికమీద ఉన్న కేథరిన్ కాలే కడుపుతో భర్తవెంట పడక గదికి వెళ్లింది. పెట్రూషియో అక్కడకూడా ఇదే నాటకం ఆడాడు. పరుపులూ, దిళ్లూ గిరవాటువేసి, "నా భార్యకు వేసే పక్క ఇదా ?" అని కేకలుపెట్టాడు.

నడుము వాల్చేటందుకుకూడా లేక కేథరిన్ ఒక కుర్చీలో కూచుని నిద్రకు జోగుతూ, మధ్యమధ్య అతను పెట్టే కేకలకు ఉలిక్కిపడి లేస్తూ ఆ రాత్రి నరకంలో ఉన్నట్టుగా గడిపింది.

మర్నాడుకూడా పెట్రూషియో ఆమెకు భోజనం లేకుండా చేశాడు. నౌకర్లు ఆమె ముందుంచిన ప్రతి పదార్థమూ బాగాలేదని తోసిపారేశాడు. ఆమె నౌకర్లను బతిమాలి తినటానికేమైనా రహస్యంగా తెచ్చి ఇమ్మన్నది. వారికి పెట్రూషియో ముందు



గానే చెప్పి ఉంచటంవల్ల వాళ్లు, "అమ్మో, యజమానికి తెలిస్తే మా ప్రాణాలు దక్కవు!" అన్నారు.

"నాకు తిండి లేకుండా, నిద్ర లేకుండా చేసి చంపటానికా ఈయన నన్ను పెళ్లాడింది ? పైపెచ్చు ఇదంతా నాపైన ప్రేమ అన్నట్టు ప్రవర్తిస్తాడు. ఈయన నన్ను అక్షరాలా తన ప్రేమతో చంపేలాగున్నాడు. ఎన్నడూ ఎవరినీ బతిమాలి ఎరగనిదాన్ని నౌకర్లవద్ద తిండికి దేబిరించవలిసి వచ్చిందే!" అనుకున్నది కేథరిన్.

ఇంతలో పెట్రూషియో ఏదో వంటకం తెచ్చి, "ఇది నీకోసం నేను స్వయంగా




చేసి తెచ్చాను, తిను!" అన్నాడు. కాని ఆమె సగంకూడా తినకముందే, "అప్పుడే తినటం అయిపోయిందా?" అంటూ పళ్లెం నౌకరుకు ఇచ్చేశాడు.

తరవాత అతను తన భార్యతో, "మనం వెంటనే బయలుదేరి మీ నాన్నగారి ఇంటికి పోదాం. నీకు మంచి కుళ్లాయీ, మంచి గౌనూ కుట్టించాను. దర్జీవాడు తెస్తున్నాడు!" అన్నాడు. తీరా వచ్చాక అతను ఆ కుళ్లాయినీ, గౌనునూ కొట్టిపారేసి, అవి కొంచెం కూడా బాగాలేవన్నాడు. కేథరిన్‌కు అవి నచ్చాయి. "వాటికేం వంక వచ్చింది? బాగానే ఉన్నాయే?" అన్నదామె.

"నేను తయారు చెయ్యమన్నట్టు తయారుచెయ్యలేదు. అవి నీకు వద్దు!" అన్నాడు పెట్రూషియో.

కాస్త తిండి కడుపులో పడిఉండటం చేత కేథరిన్‌కు రోషంవచ్చి, "నన్ను బొత్తిగా పాపాయికింద కట్టెయ్యకండి! మీకన్న గొప్పవాళ్లే నా అభిప్రాయాలను పాటించారు. నేను వాటిని ధరిస్తాను!" అని కటువుగా అన్నది.

పెట్రూషియో ఆమెను సరిగా అర్థం చేసుకోనట్టు నటించుతూ, "నీకవి నచ్చవని మొదటనే అనుకున్నాను. ఏం చేస్తాం? మీవాళ్లింటికి ఈ దుస్తులతోనే పోదాం!" అంటూ దర్జీని పంపేశాడు.

ప్రయాణానికి గుర్రాలు సిద్ధంచేయబడ్డాయి. అప్పటికి మిట్టమధ్యాన్నమయింది. కాని పెట్రూషియో తన భార్యతో, "ఇప్పుడు ఉదయం ఏడు గంటలయింది. భోజనం వేళకల్లా మనం మీవాళ్ల ఇల్లు చేరుతాం!" అన్నాడు.

"ఇప్పుడే మధ్యాన్నం దాటి రెండు గంటలయింది. మనం రాత్రిభోజనాలకే చేరుకుంటాం!" అన్నది కేథరిన్.

"నేను ఏది చెప్పినా నువు కాదంటావు. నేనివాళ బయలుదేరను. నేను బయలు

చేరేటప్పుడు ఎన్నిగంట లయిందన్నప్పటికీ దానికి తిరుగుండరాదు, అంతే!" అన్నాడు పెట్రూషియో.

గయ్యాళి కేథరిన్ తాను చెప్పినదాని కల్లా అవుననటం అలవాటు చేసుకున్నదాకా అతను ఆమెను పుట్టింటికి బయలుదేర నివ్వలేదు.

చిట్టచివరకు వారు బయలుదేరారు, కాని దారిలో చిన్న గత్తర జరిగింది. అతను ఆకాశంకేసి చూసి, "ఆహా, చంద్రుడు ఎంత దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు!" అన్నాడు. "అది చంద్రుడెందు కయింది, సూర్యుడు!" అన్నది కేథరిన్.

"ఎప్పుడూ నేనన్నది కాదనటమే! నేను రాను!" అని పెట్రూషియో వెనక్కు పోయి నంత పని చేశాడు. కేథరిన్ అతని బాధ పడలేక, "అవును అది సూర్యుడు కాదు, చంద్రుడే!" అన్నది.

"సూర్యుడైతే చంద్రుడంటావేమిటి?" అన్నాడు పెట్రూషియో. వెంటనే కేథరిన్ అతనితో మళ్ళీ ఏకీభవించింది.

కేథరిన్ పుట్టింటికి చేరినాక ఆమె చెల్లెలు బియాంకాకూ, వారింట ఉండే మరొక స్త్రీకీ పెళ్ళిళ్లు జరిగాయి. తమకు మంచి భార్యలు దొరికారనీ, పెట్రూషియో భార్య కొరకరాని కొయ్య అనీ కొత్త పెళ్లికొడుకులు గర్వంగా



చెప్పుకుని పెట్రూషియోను గేలిచేశారు. కేథరిన్ తండ్రికూడా వారితో ఏకీభవించాడు; తన కుమార్తెలో జరిగిన మార్పు ఆయన ఏమాత్రం ఎరగడు.

పెట్రూషియో వారితో పందెంవేసి, "మనం మన భార్యలను రమ్మని కబురు చేద్దాం. ఏ భార్య తనభర్త ఆజ్ఞను త్వరగా శిరసావహించేదీ చూద్దాం," అన్నాడు. ఇందుకు కొత్త పెళ్లికొడుకులు యిద్దరూ సమ్మతించారు.

మొదట బియాంకా భర్త తన భార్యను రమ్మని కబురుచేశాడు. నౌకరు తిరిగివచ్చి, "ఆమెగారు పనిమీద ఉన్నారట," అన్నాడు. తరవాత రెండోపెళ్లికొడుకు తన భార్యను రమ్మని కబురుచేశాడు. ఆమె నౌకరుతో, "ఊరికేనే పిలుస్తున్నారు, నాకు తెలుసు. నిజంగా పని ఉంటే ఆయననే ఇక్కడికి రమ్మను," అన్నది. నౌకరు ఈ మాట చెప్పగానే పెట్రూషియో నవ్వాడు. అతను నౌకరుతో, "నువు అమ్మగారి దగ్గిరికి వెళ్లి నేను వెంటనే రమ్మని ఉత్తరువు చేశానని చెప్పు" అన్నాడు.

"ఆవిడ అసలు రాదు!" అని పెళ్లికొడుకులు అంటుండగానే కేథరిన్ హడావిడిగా అక్కడికి వచ్చి, "ఎందుకండీ పిలిచారుట?" అని అడిగింది.

"నువు వెళ్లి పెళ్లికూతుళ్ల నిద్దరినీ తీసుకురా!" అన్నాడు పెట్రూషియో.

కేథరిన్ వెళ్లి పెళ్లికూతుళ్లను తెచ్చింది. అందరూ ఆమెలో కలిగిన మార్పు చూసి నివ్వెరపోయారు. కేథరిన్ తండ్రి అయిన బాప్టిస్టా పెట్రూషియోతో, "నాయనా, నువు నిజంగా సమర్థుడ వనిపించావు. నాకు మరొక కూతురు కలిగిందా అనిపిస్తున్నది. అందుచేత మరి ఇరవై వేలు భరణం ఇస్తాను," అన్నాడు.

ఒకప్పుడు కేథరిన్‌ను గయ్యాళి అన్న వారే ఇప్పుడు మహాసాధ్వి అన్నారు.





కుర్రాడు : నాన్న తల బట్టతల అయిందేం ?
తల్లి : ఆయన ఎక్కువ ఆలోచిస్తారుగదూ ?
కుర్రాడు : నీ తల అలా కాకపోవటానికి
కారణం అదా ?



భార్య : మన పక్క ఇల్లు అంటుకున్నదండీ!
లంకాదహనం చదివే భర్త పరధ్యానంగా :
అంటుకోనీ! బాగా మండనీ!



ఆసామి ఆవు కళ్లకు ఆకుపచ్చ అద్దాలు
పెట్టి : "ఇది ఎండు గడ్డి కాదు,
పచ్చి గడ్డే! తిను, తిను!"



గేదె : (దూడబొమ్మతో) నా యజమాని లాగే
నా పొట్టతిప్పలు నేను పడుతున్నాను.
ఏమీ అనుకోకు!

# అంధురాలి అద్దం

పట్టు విడువని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానానికేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవంటి పరోపకార గుణం కలవారు సహాయపడినట్టయితే కుంటివారికి కాళ్లు లేకుండానూ, మూగవారికి నోరు లేకుండానూ, గుడ్డివారికి కళ్లు లేకుండానూ జీవితం సుఖంగా జరిగిపోతుందిగద! ఇది నిరూపించటానికిగాను నీకు హేమావతి కథ చెబుతాను. అది వింటూ నీ శ్రమను కొంత సేపు మరిచిపో!" అంటూ ఈ విధంగా చెప్ప నారంభించాడు:

కాంచనపురం సమీపంలో ఒక గ్రామంలో హేమావతి అనే సంపన్నుల కుమార్తె ఉండేది. ఆమె పదేళ్ల పిల్ల అయి ఉండగా కళ్లకు మసక ఆరంభమై కొద్దికాలానికి పూర్తిగా గుడ్డిది అయిపోయింది.

## బేతాళ కథలు




తరవాత కొద్దికాలానికే హేమావతి తండ్రి ఆస్తి క్రమంగా అప్పులవాళ్ల పాలయింది. హేమావతి తల్లీ, ఇతర బంధువులూ ఈ సంగతులు ఆ గుడ్డిపిల్లకు తెలియకుండా జాగ్రత్తగా దాచారు.

సంపద యావత్తూ పోయినా హేమావతికి ఏ లోటూ జరగటంలేదు. మిగిలినవాళ్లు ఏమి తిన్నా, ఆమెకు మృష్టాన్నాలే పెడుతున్నారు. ఆమె పట్టుదుస్తులే ధరిస్తున్నది. హంసతూలికాతల్పంపైనే శయనిస్తున్నది. తనకు కళ్లు లేకుండాపోయాయన్న విచారం తప్ప ఆమెకు మరే విచారమూ లేదు.

ఇలా పదేళ్లు గడిచాయి. హేమావతి తన గుడ్డితనానికి అలవాటుపడిపోయింది. తాను గుడ్డిదిగనక తనకు పెళ్లి కాదని ఆమె ఎరుగును. తాను గొప్ప సౌందర్యవతి అని అందరూ చెప్పినప్పటికీ ఆమె తనకు పెళ్లి అవుతుందని ఆశించలేదు. ఎంత అందగత్తె అయితేమాత్రం కళ్లు లేనిదానితో ఎవరు కాపరం చేస్తారు? అందుచేత తన జీవితం ఏ లోటూ లేకుండా పుట్టింట ఇదే విధంగా గడిచిపోతుందని ఆమె ఆశించింది.

ఒకనాడు హేమావతి ఇంటికి ఒక యువకుడు వచ్చాడు. అతని పేరు సోమదత్తుడు. హేమావతి అతనిని ఎరగదుగాని, ఆమె కుటుంబానికి అతను కొత్తవాడు కాడు. అతను పట్టణంలో ఉండి వైద్యవిద్య నేర్చుకుంటున్నాడు.

సోమదత్తుడు హేమావతితో చాలా ఆదరంగా మాట్లాడాడు. ఆమె చక్కదనాన్ని మెచ్చుకున్నాడు. చివరకు అతను ఆమెతో, "నేను నిన్ను ప్రేమతో చూసుకుని ఏ లోటూ రాకుండా చేస్తాను. నన్ను పెళ్లాడతావా?" అని అడిగాడు.

తనను ఒక యువకుడు పెళ్లాడటానికి సిద్ధంగా ఉన్నందుకు హేమావతి సంతోషించింది, కాని కళ్లు లేని తనను చూసి కొంతకాలానికైనా అతను అసహ్యపడతాడనీ,

తనకు పుట్టింట జరిగినట్టుగా మరొక చోట జరగదనీ అనుకున్నది. ఆమె సోమదత్తుడితో, "నావంటిదానికి పెళ్లి ఎందుకు? మావాళ్లు ఇంత ఉన్నవారే గనక నన్ను భరించగలరు. నేనిక్కడే జీవితం వెళ్లబుచ్చ నిశ్చయించాను!" అన్నది.

సోమదత్తుడు ఏమీ అనలేదు. అతను రెండు పూటలుండి నగరానికి తిరిగి వెళ్లిపోయాడు. అతను వెళ్లిన కొద్దిరోజులకు హేమావతి తన తల్లిదండ్రులు పేదజీవితం గడుపుతున్నారని తెలుసుకున్నది. ఇది ఎలా జరిగిందంటే, ఒకనాటి సాయంకాలం ఆమె దొడ్డిలో ఒకచోట కూచుని ఉండగా పొరుగింటివాళ్లు మాట్లాడుకునే మాటలు వినిపించాయి. గుడ్డివాళ్లకు చెవులు వాడి. పొరుగువాళ్లు చిన్నగా మాట్లాడుకున్నప్పటికీ హేమావతి నిజం తెలుసుకున్నది. తన తల్లిదండ్రులు తన మనసును క్షోభపెట్టటం ఇష్టంలేక, నిజాన్ని దాచిపెట్టి, తనను సుఖపెట్టటానికి వారు మరింత కష్టాలుపడుతున్నారని ఆమెకు అర్థమయింది. ఈ సంగతి ముందే తెలిసిఉంటే ఆమె సోమదత్తుణ్ణి పెళ్లాడటానికి అప్పుడే ఒప్పుకుని ఉండేది.

కొంతకాలానికి సోమదత్తుడు మళ్లీ వచ్చాడు. అతను హేమావతితో, "హేమా, నన్ను పెళ్లాడటానికి నీకేమిటి అభ్యంతరం?



నేను నీకు ఏ కష్టమూ రానివ్వను. నేను నీకు అద్దంలాగా ఉంటాను. నా ద్వారా నీకు కళ్లు లేని లోటుకూడా తీరుతుంది! నువు చూడలేనివన్నీ వర్ణించి చెబుతాను! నన్ను పెళ్లాడు!" అని మళ్లీ అన్నాడు.

"మిమ్మల్ని పెళ్లాడటంకంటె నాకు కావలిసిందేమిటి? మీరు తప్ప ఇంకెవరూ నన్నీ మాట అడగలేదు. కాని నాకోసం మీరు మీ జీవితాన్ని పాడుచేసుకోవటం నాకిష్టం లేదు. అందుకే సందేహిస్తున్నాను!" అన్నది హేమావతి.

"చూడు, హేమా! నువు కళ్లు లేనిదాని వైనా నీ అందం చూసి పెళ్లాడుతున్నాను. ఇందులో నేను చేస్తున్న త్యాగం ఏమీలేదు. కళ్లుగల అందగత్తె నన్ను ఎందుకు పెళ్లాడు తుంది? నేను చాలా అనాకారివాణ్ణి. నీవంటి భార్య దొరకటం నాకు నిజంగా అదృష్ట మన్నమాట!" అన్నాడు సోమదత్తుడు.

ఈ మాట విన్నాక హేమావతి మనసు కొంత స్థిమితపడింది. సోమదత్తుడు అంద గాడైనా, అనాకారివాడైనా తన గుడ్డికళ్లకు ఒకటే. ఇక మిగిలిన విషయాలలో అతను చాలా మంచివాడు, తనతో చక్కగా కబుర్లు చెబుతాడు, తన పక్కన కూచుని ప్రతిదీ వర్ణిస్తాడు. అతని వర్ణన వింటుంటే ఆమెకు కళ్లు ఉన్నట్టే అనిపించేది.





అందుచేత హేమావతి అతన్ని పెళ్లాడ టానికి ఒప్పుకున్నది. ఇద్దరికీ వివాహం జరిగింది. తన వివాహంవల్ల తన తల్లి దండ్రులకు ఒక పెద్ద బరువు దిగిపోయిందని ఆమె సంతోషించింది.

సోమదత్తుడు అన్న మాట నిలబెట్టు కున్నాడు. అతను తన గుడ్డిభార్యకు ఏ లోటూ లేకుండా జరుపుతూ, ఆమెను సుఖపెట్టటానికి అనుక్షణమూ ప్రయ త్నించేవాడు.

ఒకనాడు సోమదత్తుడు తన భార్యతో, "హేమా, నీకు కళ్లు కనిపించకపోవటానికి కారణం తెలుసా? నీ కళ్లలో శుక్లాలు పెరిగాయి, వాటిని చికిత్స చేసి తొలిగించి నట్టయితే నువ్వుకూడా అందరిలాగే చూడ గలుగుతావు," అన్నాడు.

ఈ మాట వినగానే హేమావతి ముందు సంతోషించిందిగాని, ఆలోచించిన మీదట తనకు కళ్లు రాకుండా ఉండటమే మంచి దనుకున్నది. కళ్లు రావటంవల్ల ప్రపంచాన్ని చూడవచ్చు, ప్రకృతిసౌందర్యాన్ని అనుభ వించవచ్చు. అయితే ఆ కళ్లతోటే తాను తన కురూపి భర్తను చూసి విచారపడటం కూడా జరగవచ్చు. ప్రస్తుతం తాను గుడ్డిది గనక తన భర్తయందు ఎంతో ఆదరమూ, కృతజ్ఞతా కలిగి ఉంటున్నది. అతని అంద విహీనత చూసినాక ఆ భావాలు కాస్తా మారిపోతే ఇక తన జీవితంలో నిజమైన ఆనందం ఉండదు.

ఈ విధంగా ఆలోచించి హేమావతి, "నాకు కళ్లులేని లోటేమీ లేదు. గుడ్డిదానికి అద్దంలాగా మీరున్నారుగద!" అన్నది.

కొంతకాలం గడిచింది. హేమావతి ఒక మగపిల్లవాణ్ణి కన్నది. వాణ్ణి చూసి అందరూ ఎంతో ముచ్చటపడి, "ఎంత చక్కనివాడు! అచ్చుగా తల్లిపోలికే!" అన్నారు.

లోకమంతా మెచ్చుకునే తన బిడ్డను తాను కళ్లారా చూసుకోవటానికి లేకపోయే

సరికి మాతృహృదయం మథనపడింది. ఎన్నో సంగతులు తన భర్త వర్ణిస్తుంటే తాను స్వయంగా చూస్తున్నట్టే భావించి సంతోషించిన మనిషి, ఇప్పుడు అతను తన కుమారుణ్ణి వర్ణిస్తుంటే వాణ్ణి స్వయంగా చూడలేనందుకు మరింత బాధపడి, తన గుడ్డితనం రెట్టింపయినట్టుగా భావించ నారంభించింది.

ఆమె ఒకనాడు తన భర్తతో, "నా కళ్లకు చికిత్స చేయవచ్చునన్నారే? ఆ చికిత్స ఎవరు చేస్తారు?" అని అడిగింది.

"నేనే చేస్తాను. అది చాలా సులువైన చికిత్సే. వారం పది రోజులపాటు కళ్లకు గంతలు కట్టుకుని ఆ తరవాత విప్పెయ్య వచ్చు," అన్నాడు సోమదత్తుడు.

"అయితే నాకు కళ్లు తెప్పించండి!" అన్నది హేమావతి.

సోమదత్తుడు తన భార్యకళ్లనుంచి శుక్లాలు తీసి కళ్లకు కట్టుకట్టాడు. కొన్ని రోజుల అనంతరం ఆమె తల్లి స్వయంగా కట్టు విప్పింది. హేమావతికి కళ్లు వచ్చాయి. అందుకామె ఎంతో సంతోషించింది. ఆమెకు కొడుకును తెచ్చి చూపారు; ఆమె ఆనందం రెట్టింపయింది. తరవాత ఆమె అద్దంలో తనను తాను చూసుకుని మరింత ఆనం దించింది. ఆమె తల్లిని, "మావారెక్కడ?"



అని అడిగింది. ఆ సమయంలోనే సోమదత్తుడు ఆమె ఉన్నచోటికి వచ్చాడు.

హేమావతి అతనే తన భర్త అని నమ్మలేకపోయింది. ఎందుకంటే అతను ఏమాత్రమూ కురూపి కాకపోగా చాలా అందగాడు...ఆ అందగాడే తన భర్త అని తెలిసినాక హేమావతి ఆనందానికి హద్దు లేకుండాపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. సోమదత్తుడు తాను కురూపినని ఎందుకు అబద్ధమాడాడు? తన భర్తను చూడవలిసి వస్తుందని గుడ్డిగా ఉండటానికి సయితం నిశ్చయించుకున్న హేమావతి కొడుకును చూసుకునేటందుకు కళ్ళు కోరటంలో రహస్యమేమిటి? ఆమెకు భర్తపైన ఉండే ప్రేమ కొడుకుపైన ఉండే ప్రేమ కంటె తక్కువా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హేమావతికి భర్తపైన ప్రేమ ఉండబట్టే అతని అనాకారితనాన్ని చూడకుండా ఉండాలని నిశ్చయించుకున్నది. తన భర్త నిజంగా కురూపి అని ఆమె నమ్మింది. తన కొడుకు విషయంలో ఆమెకు అలాటి అపోహ లేదు. వాడు చాలా అందమైనవాడని అందరూ చెప్పారు. అందుచేత ఆమె వాణ్ణి చూడగలందులకు కళ్ళు కోరింది. వాణ్ణి చూసుకునే ఆనందంకోసం ఆమె తన భర్త అనాకారితనాన్ని చూసి సహించటానికికూడా సిద్ధపడింది. ఇక సోమదత్తుడు ఆమెతో తన అందంగురించి చెప్పకపోవటానికి కారణమేమంటే, తాను కళ్ళులేనిదాన్ని పెళ్ళాడటంలో గొప్ప త్యాగంచేస్తున్నట్టు కనపడకుండా ఉండాలనే," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై చెట్టెక్కాడు. —(కల్పితం)



# బతక నేర్చినవాడు

ఒక రాజుగారు తన మంత్రులతో రాజ్యాంగానికి సంబంధించిన ముఖ్య విష యాలు మాట్లాడుతున్నారు. మంత్రులు ఎవరికి తోచిన సలహా వారు యిస్తున్నారు. అంతా విన్న రాజుగారు తన అభిప్రాయం ఏమిటో చెప్పి, గోడకు చేరగిలబడి కూర్చున్న విదూషకుడికేసి చూస్తూ, "ఏమోయ్, అంతా విన్నావుగదా ? నువ్వు ఎవరి అభిప్రాయంతో ఏకీభవిస్తావు ?" అన్నాడు.

"మహారాజా, మీ అభిప్రాయమే సర్వోత్తమమైంది!" అన్నాడు విదూషకుడు.

ఇది జరిగిపోయిన నాటి సాయంత్రం మంత్రులు విదూషకుణ్ణి ఒంటరిగా దొరకపుచ్చుకుని, "నీ ధోరణి మాకేమీ బాగాలేదు. ఇంతమంది అనుభవజ్ఞులం మేం చెప్పినదానికన్న, రాజుగారి మాటల్లో నీకేం గొప్ప కనబడింది ?" అని అడిగారు.

ఆ మాటలకు విదూషకుడు నవ్వి, "చర్చించిన వ్యవహారం భవిష్యత్తులో ఎలా పరిణమిస్తుందో ఆ ఒక్క దేవుడికే ఎరుక! అందువల్ల రాజుగారి అభిప్రాయంతో ఏకీభవించటమే మనకు మేలు. దానివల్ల కీడు జరిగినా, అందుకు బాధ్యులు రాజుగారే గనక, మన ప్రాణాల కేమీ ముప్పు వుండదు. ఆయన పట్ట పగలు వెలుగుకేసి చూస్తూ, 'ఆహా, ఎంత గాఢాంధకారంగా వున్నది!' అంటే, 'అవును, మహారాజా! చంద్రుడుకూడా మేఘాలమాటున మటుమాయమయాడు,' అని మనం జవాబిస్తే పోయిందేమిటి ?" అన్నాడు.






# వ్యర్థమైన తీర్పు

నాగపట్టణానికి రాజైన శక్తిసింహుడి ఆస్థానంలో ఆయనకు అభిమానపాత్రులు ఇద్దరు ఉండేవారు. వారిలో ఒకడు సూర్యవర్మ అనే సామంతుడు. ఈయన రాజు గారికి దగ్గిరబంధువుకూడానూ. ఆయనకు సీమంతిని అని ఒక పెళ్లియీడు వచ్చిన కుమార్తెకూడా ఉండేది.

రాజుగారికి ప్రాణంకన్న ఎక్కువైన రెండవ వ్యక్తి చంద్రపాలుడనే యువకుడు. అతను రాజుగారి ప్రధాన అంగరక్షకుడు. రాజుగారు యుద్ధానికి బయలుదేరి వెళ్లి నప్పుడుకూడా చంద్రపాలుడు రాజుగారి వెంట ఉండి అసామాన్య పరాక్రమ విక్రమాలతో యుద్ధం చేసేవాడు. అతను యుద్ధరంగంలో రాజుగారి ప్రాణాలను ఎన్నిసార్లు కాపాడాడో లెక్కలేదు. అందుచేత రాజుగారు అతణ్ణి తన కొడుకుకన్న ఎక్కువగా చూసుకునేవాడు. రాజభటులలో ప్రతి ఒక్కడూ అతనిని దైవంలాగా పూజించేవారు.

సూర్యవర్మ కుమార్తె సీమంతిని ఏనాడో చంద్రపాలుణ్ణి తన భర్తగా ఎన్నుకున్నది. తగిన అవకాశం చూసి అతనిని పిలిపించింది. ఇద్దరూ మాట్లాడుకున్నారు, ఒకరి నొకరు ప్రేమించుకున్నవారు కావటంచేత పెళ్లాడ నిశ్చయించుకున్నారు.

చంద్రపాలుడు ఈ విషయాన్ని రాజుగారికి చెప్పాడు. రాజుగారు సూర్యవర్మను పిలిచి, "నీ కుమార్తె సీమంతిని చంద్రపాలుణ్ణి ప్రేమిస్తున్నట్టు విన్నాను. వారిద్దరికీ వివాహం జరుపుదామా?" అని అడిగాడు.

ఈమాట వినగానే సూర్యవర్మ ముఖం జేవురించింది. "అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు! నేనీ పెళ్లికి ఒప్పను! అసలు నా కూతురు చంద్రపాలుణ్ణి ప్రేమిస్తున్నదంటే కూడా నేను నమ్మను!" అన్నాడాయన రాజుగారితో.

బి. రాజేశ్వరరావు

తరవాత సూర్యవర్మ ఇంటికి వెళ్లి కుమార్తెతో మాట్లాడాడు. తాను చంద్రపాలుణ్ణి ప్రేమిస్తున్నట్టు సీమంతిని ఒప్పుకున్నది. సూర్యవర్మ మండిపడి ఆమెను నానా చివాట్లూ పెట్టాడు.

ఇది జరిగిన మర్నాడే సీమంతిని ఎవరికీ తెలియకుండా ఇంటినుంచి బయలుదేరి వెళ్లి చంద్రపాలుణ్ణి కలుసుకున్నది. వారిద్దరికీ ఒక పురోహితుడు పెళ్లిచేశాడు. వారిద్దరూ అడవిలోకి వెళ్లి అక్కడ కాపరం పెట్టారు.

ఈ అడవి చంద్రపాలుడిదే. కొంతకాలం కిందట రాజుగారు చంద్రపాలుడికి నగరం వెలపల కొంత భూమి మాన్యంగా ఇచ్చాడు. అందులో ఒక భాగంలో అశోకచెట్లు మాత్రమే ఉన్న అడవి ఉన్నది. అక్కడ చంద్రపాలుడు కుటీరం నిర్మించాడు.

సూర్యవర్మ రాజుగారితో ఏకాంతంగా మాట్లాడి, "నేను నలుగురిలోనూ తల ఎత్తుకు తిరగలేని పరిస్థితి ఏర్పడింది. నా కుమార్తెను నాకు వప్పగించమని మీరు కబురుచేస్తే చంద్రపాలుడు మీ మాట తోసి వెయ్యడు!" అన్నాడు.

రాజుగారు, "కబురు చేస్తాను!" అన్నాడు. కాని ఆయన ఏమీ చెయ్యలేదు, చూసీ చూడనట్టుగా ఊరుకున్నాడు.



సూర్యవర్మ రాజుగారిచేత ఏదో ఒకటి చేయించాలనే ఉద్దేశంతో ఒక యుక్తి పన్నాడు. ఆయన నిండుసభలో లేచి నిలబడి, "మహారాజా, చంద్రపాలుడు నా కుమార్తెను బలాత్కారంగా తీసుకుపోయి అరణ్యంలో ఉంచాడని తెలిసింది. ఆమెను తిరిగి నాకు ఇప్పించి, ఆ దుర్మార్గుణ్ణి శిక్షించి నాకు న్యాయం చేయమని తమరిని అర్థిస్తున్నాను!" అన్నాడు.

ఇప్పుడు రాజుగారు విధిగా చర్య తీసుకోవలిసి వచ్చింది. ఆయన తన భటులకు, "మీరు అరణ్యానికి వెళ్లి చంద్రపాలుణ్ణి బంధించి తీసుకురండి. సీమంతినిని తెచ్చి



క్షేమంగా సూర్యవర్మ ఇంట చేర్చండి!" అని ఉత్తరు విచ్చాడు. వెంటనే భటులు అశోకవనానికి బయలుదేరారు. సూర్యవర్మ కూడా కత్తితీసుకుని వీరుడులాగా వారి వెంట వెళ్లాడు.

నిజానికి రాజభటులందరికీ చంద్రపాలుడంటే అమితమైన అభిమానం. అతనితో యుద్ధం చెయ్యాలన్న కోరిక వారిలో ఏ ఒక్కడికీ లేదు. అందుచేత వారు తమలో ఇద్దరిని ముందుగా చంద్రపాలుడి వద్దకు పంపి జరిగిన సంగతి కబురుచేశారు.

సూర్యవర్మ తనను పట్టుకోవటానికి రాజభటులను తెస్తున్నాడని తెలియగానే చంద్రపాలుడు సీమంతినిని అరణ్యంలో దూరంగా ఒక రహస్యస్థలంలో దాచి తిరిగి తన కుటీరానికి వచ్చేశాడు. మరికొంతసేపటికి సూర్యవర్మ రాజభటులతోసహా వచ్చి, భటులను కుటీరంచుట్టూ నిలబెట్టి తలుపు తట్టాడు.

చంద్రపాలుడు బయటికి వచ్చాడు. అతను సూర్యవర్మను ఎగాదిగా చూసి, "మీకు శౌర్యం తక్కువయిందా ఏమిటి, ఇంతమందిని తోడుతెచ్చారు? ఇవాళ మీరో నేనో తేల్చుకుందాం!" అంటూ కత్తిదూశాడు.

"నీతో యుద్ధంచేసే ఖర్మమేమిటి నాకు? ఒరే, ఈ నీచుణ్ణి పట్టి బంధించండి!" అన్నాడు సూర్యవర్మ రాజభటులతో. వారిలో ఒక్కడూ కదలలేదు. చంద్రపాలుడు ద్వంద్వయుద్ధానికి అహ్వానిస్తే నిరాకరించినందుకు సూర్యవర్మను చూసి వాళ్లు అసహ్యించుకున్నారు.

"సరే అయితే పట్టుకోండి!" అంటూ చంద్రపాలుడు రాజభటుల మధ్యగా అరణ్యంలోకి పరిగెత్తాడు. రాజభటులు తొలిగి దారి ఇచ్చారేగాని అతన్ని పట్టుకోలేదు. కుటీరంలో ఎంతవెతికినా సీమంతిని జాడ దొరకలేదు. సూర్యవర్మ చేసిన యింతపెద్ద ప్రయత్నమూ బూడిదలో పోసిన పన్నీరయింది.



ఇక రాజుగారిని నమ్ముకుంటే పని కాదని సూర్యవర్మ ఈసారి ఇంకొక ఎత్తు ఎత్తాడు. ఆయన కొందరు కవులనూ, గాయకులనూ పిలిపించి, వారికి డబ్బు బాగా ఇచ్చి, "మీరు అశోకవనానికి వెళ్లి అక్కడ ఉండే చంద్రపాలుణ్ణి కీర్తించుతూ పద్యాలు చదవండి, పాటలు పాడండి. ఈలోపుగా నా నౌకర్లు అతన్ని పట్టి బంధించి నాదగ్గిరకు తెస్తారు. తరవాత మీదారిన మీరు వెళ్లిపోవచ్చు!" అన్నాడు.

ఈ యుక్తి పారింది. కవిగాయకులు చంద్రపాలుడి కుటీరానికి వెళ్లి స్తోత్రపాఠాలు చదివే సమయంలో సూర్యవర్మ నౌకర్లు అకస్మాత్తుగా చంద్రపాలుడిపై బడి బంధించి తెచ్చి సూర్యవర్మ ఎదట ఉంచారు. ఆయన అతన్ని పట్టించుకుని రాజసభకు వెళ్లి, "మహారాజా, దోషిని పట్టితెచ్చాను, విచారించండి!" అన్నాడు.

రాజుగారు చంద్రపాలుడితో, "నీవు సీమంతినిని బలాత్కారంగా తీసుకుపోయావట. దానికేం చెబుతావు?" అని అడిగాడు.

"అదే నా నేరమైతే నేను నిర్దోషిని, మహారాజా! సీమంతిని బుద్ధిపూర్వకంగా నావద్దకు వచ్చి నన్ను వివాహ మాడింది!" అన్నాడు చంద్రపాలుడు.





సూర్యవర్మ ఆగ్రహావేశంతో, "నేను ఇతనికి కన్యాదానం చెయ్యలేదు. అందు చేత తండ్రి నైనందుకు నాకు సీమంతినిపై గల హక్కు ఇంకా నాదిగానే ఉన్నది. ఈ పెళ్లి చెల్లదు!" అన్నాడు.

రాజుగారు ఉభయులనూ ఏదోవిధంగా సమాధానపరచాలని ప్రయత్నించాడు. సీమంతినిపై గల హక్కును విడిచిపుచ్చ టానికి ఇటు సూర్యవర్మా సమ్మతించలేదు, అటు చంద్రపాలుడూ సమ్మతించలేదు.

చివరకు ప్రాణం విసిగి, "అయితే నా తీర్పు వినండి. సీమంతిని ఉభయులవద్దా ఉంటుంది. చెట్ల ఆకులు రాలేదాకా భర్త వద్ద ఉండి, చెట్లు మోడయినాక తండ్రి ఇంటికి వచ్చేస్తుంది. తిరిగి చెట్లు చిగిర్చినాక తన భర్తవద్దకు వెళ్ళుతుంది!" అన్నాడు.

ఈ తీర్పు సూర్యవర్మకూ నచ్చలేదు, చంద్రపాలుడికీ నచ్చలేదు; కాని దానికి ఇద్దరూ బద్ధులుగాక తప్పింది కాదు.

కొంతకాలం గడిచింది. ఆకులు రాలే కాలం వచ్చింది. చెట్లన్నీ మోడుకాసాగాయి. సూర్యవర్మ తన కుమార్తె వద్దకు తన మనుషులను పంపి, రాజుగారి తీర్పు గురించి ఆమెకు చెప్పి ఆమెను వెంటపెట్టుకు రమ్మన్నాడు. ఒకసారి ఆమె తన ఇంటికి వస్తే తిరిగి భర్తవద్దకు వెళ్లకుండా చెయ్యా లనే ఆయన దురుద్దేశం.

సీమంతిని తన తండ్రి దూతలు చెప్పిన దంతా విన్నది. ఆమె వారితో, "ఆకులు రాలి చెట్లు మోడయాకగద నేను మా తండ్రి ఇంటికి వెళ్లేది. ఇంకా ఆకులు రాలటం లేదు. ఈ చెట్లు మోడయాక అలాగేవస్తాను!" అంటూ వారికి చుట్టూఉన్న అశోక వృక్షా లను చూపింది. సూర్యవర్మ మనుషులు తిరిగి వెళ్లిపోయారు.

అశోకవృక్షాలు ఆకులు రాల్చవు, ఎన్నడూ మోడు కావు. అందుచేత సీమంతిని తన తండ్రి ఇంటికి మళ్లీ వెళ్లనేలేదు.






# చెట్టునీడ

ఒక గ్రామంలో ఒక ఆసామీ ఇంటి ముందు పెద్ద చెట్టుండేది. వేసవికాలంలో దాని నీడలో చల్లగా ఉండేది. ఆసామీ అక్కడికి వచ్చి కూచుంటూ ఉండేవాడు.

ఒకనాటి మధ్యాహ్నం ఆయన భోజనం చేసి చెట్టుకింద కూచోటానికి వచ్చేసరికి అక్కడ ఒక అలగావాడు కూచుని ఉన్నాడు.

"ఇదేమిటి? నిన్నిక్కడ ఎవరు కూచోనిచ్చారు? పద, పద!" అని ఆసామీ అలగావాణ్ణి అదిలించాడు.

"ఎందుకు, బాబూ, అలా కోప్పడతారు? ఎండ జాస్తిగా ఉంది. నీడలో చల్లగా ఉందని కూచున్నాను!" అన్నాడు అలగావాడు మర్యాదగా.

"అదేమీ కుదరదు. ఈ చెట్టు నాచెట్టు. నేను దీనికి ఎన్నో ఏళ్ళుగా నీళ్ళుపోసి పెంచి ఇంత చెట్టు చేశాను. అందుచేత దీని నీడ కూడా నాదే!" అన్నాడు ఆసామి.

"అలా చెప్పరేం; అయితే ఒకపని చేయండి. ఈ నీడ నాకు అమ్మండి, డబ్బిస్తాను!" అన్నాడు అలగావాడు.

డబ్బు మాట వినేసరికి ఆసామీకి ఆశ పుట్టుకొచ్చింది. "సరే అమ్ముతాను. ఏమిస్తావు?" అన్నాడాయన.

బేరం జరిగింది. ఇద్దరు ముగ్గురు దారే పొయ్యేవాళ్ల సమక్షంలో అలగావాడు ఆసామీకి డబ్బిచ్చి చెట్టునీడను తను కొనేసుకున్నాడు.

అది మొదలు అలగావాడు రోజూ వచ్చి చెట్టునీడను కూచుంటూండేవాడు; దారిన ఎరిగున్న వాళ్లెవరన్నా పోతూంటే వాళ్లను కూడా పిలిచి నీడలో కూచోబెట్టేవాడు. అలా వచ్చిన వాళ్లవెంట పశువులుంటే అవికూడా నీడలో చేరేవి.

ఇది చాలక, నీడ కొన్న అలగావాడు మరొక పని చేయనారంభించాడు. ఆ చెట్టు

కె. ఇందుమతి

నీడ ఎక్కడెక్కడ పడిందో అక్కడికల్లా వెళ్లేవాడు. సమయాన్ని బట్టీ, ఋతువును బట్టీ ఆ చెట్టునీడ అసామీ ఇంటి ఆవరణ లోనూ, పంచలోనూ, పడకగదిలోనూ, నడవలోనూ పడేది. అలగావాడు మొహ మాటం లేకుండా నీడ పడిన చోటికల్లా వెళ్లి తిష్ఠవేసేవాడు.

ఇదంతా చూసి అసామీకి మండి పోయింది. "ఏయ్, మా దొడ్లోకీ, వసారాలోకీ, గదిలోకీ వచ్చి కూచునేటందుకు నీకేం హక్కున్నది?" అని ఆయన అలగావాణ్ణి గద్దించి అడిగాడు.

"బాబూగారూ, నేను మీ చెట్టునీడను డబ్బుపోసి కొనుక్కున్నాను. అది ఎక్క డెక్కడ పడుతుందో అక్కడల్లా కూచోటానికి నాకు హక్కున్నది!" అన్నాడు అలగావాడు.

అసామి రుసరుసలాడాడు. కాని తాను తన చెట్టునీడను ఆ పేదవాడికి అమ్మిన మాట నిజమే.

ఒకరోజు అసామి ఇంట ఏదో అక్కర అయింది. చుట్టాలనూ బంధువులనూ పిలిచి విందు చేస్తున్నాడు. వారంతా భోజనంచేసే చోట చెట్టునీడ పడింది. సమ యానికి అలగావాడు చక్కావచ్చి ఆ నీడలో కూచున్నాడు. వచ్చిన అతిథులకు ఇదేమీ అర్థం కాలేదు. "పిలవని పేరంటంగా వచ్చి ఈ మనిషి ఎవడో ఇక్కడ చతికిల బడ్డాడేమిటి?" అని వారు ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు.

అలగావాడు తాను నీడ కొనుక్కున్న వైనమంతా వాళ్లకు చెప్పేశాడు.

ఈ వింతసంగతి వింటూనే అక్కడవున్న అతిథులందరూ గొల్లున నవ్వారు.

అసామికి నలుగురిలోనూ తల తీసేసి నట్టయింది.

ఆ మర్నాడే ఆయన తన కుటుంబంతో సహా ఆ గ్రామం విడిచి, మరో దూరగ్రామా నికి వెళ్లిపోయాడు.






పోర్టరు : అయ్యగారూ, మనం బ్రిడ్జిమీదిగా వెళ్లొద్దు, రైలుపట్టాలు దాటిపోదాం. ఎందుకంటే అది పాతబ్రిడ్జి, దాన్ని నమ్మటానికి లేదు........




# సరిహద్దు తగాదా

వింధ్యపర్వతాలలో కపిలా, ధవళా అని రెండు దేశాలుండేవి. వాటి మధ్య ఒక చిన్న పర్వతశ్రేణి ఉండేది. అందులో సారవంత మైన లోయలూ, సంపన్నమయిన అరణ్యాలూ ఉండేవి.

కపిల ధవళదేశాల మధ్య సరిహద్దు సరిగా నిర్ణయం కాలేదు. అందుచేత పర్వత శ్రేణిపై గల అరణ్యాలూ, లోయలూ "మావి" అంటే, "మావి" అని ఉభయదేశాలవారూ జగడమాడుతూండేవారు. ఒక దేశంవాళ్లు కోసి ఎండబెట్టిన పశువుల మేతను రెండో దేశంవాళ్లు ఎత్తుకుపోయేవారు; ఒక దేశం వాళ్లు కొట్టిన వనమృగాలను మరొక దేశం వాళ్లు ఎత్తుకుపోయేవారు.

ధవళులకూ, కపిలులకూ మధ్య ఈ సరిహద్దు తగాదా అనేక తరాలపాటు ఈ విధంగా నడిచింది. చివరకు ఈ తగాదాలతో, దెబ్బలాటలతో విసుగెత్తి ఉభయ దేశాల ప్రజలూ కలిసి తమ దేశాలమధ్య సరిహద్దు ఒకటి కరాఖండిగా నిర్ణయించుకుందామనే అభిప్రాయానికి వచ్చారు. ఇందుకుగాను వారు ఒక ఒప్పందం చేసుకున్నారు. అదేమిటంటే, ఒకరోజు తెల్లవారుజామున, తొలికోడి కూయగానే కపిలనగరం నుంచి ఒక యువకుడూ, ధవళనగరం నుంచి మరొక యువకుడూ బయలుదేరి పరిగెత్తుకుంటూ ఒకరికేసి ఒకరు రావాలి; ఇద్దరూ కలిసిన చోట ఉభయదేశాల సరిహద్దు ఏర్పాటవుతుంది.

వెంటనే ఉభయపక్షాలా బాగా పరుగెత్తగలవాళ్లు ఎన్నుకోబడ్డారు. పందెంరోజున కూసేటందుకు కోడిపుంజులుకూడా ఏర్పాటయాయి.

ధవళులు తమ కోడిని ఒక బుట్టలో ఉంచి దానికి సరిగా తిండి పెట్టకుండా డొక్క మాడ్చారు. అది ఆకలి దప్పులతో

ఎస్. రంగనాథం

మాడితే నిద్రపోకుండా ఉండి త్వరగా కూస్తుందని వారి ఉద్దేశం.

కపిలులు అలా చెయ్యలేదు. వారు తమ పుంజును బాగా మేపి మంచి పోషణ చేశారు. ఇంత బాగా చూసినందుకు అది తమపట్ల కృతజ్ఞత కలిగిఉండి పందెం రోజున త్వరగా కూస్తుందని వారి నమ్మకం.

పందెంరోజు వచ్చింది. ఇంకా తూర్పు తెల్లారక ముందే ధవళుల కోడి కూసింది. వెంటనే ధవళ యువకుడు బయలుదేరి కపిలకేసి పరుగుతీశాడు.

కాని కొండ అవతల కపిలలో తెల్లగా తెల్లారినాకకూడా కోడిపుంజు నిద్రపోతూనే ఉన్నది. దానిచుట్టూ జనం దీనంగా నిల బడ్డారు. అయితే మాటకు కట్టుబడి ఒక్కరూ దాన్ని లేవగొట్టలేదు.

చిట్టచివరకు కోడి లేచి రెక్కలు విది లించి కూసింది.

కపిలయువకుడు తనకున్న యావచ్ఛక్తినీ వినియోగించి ధవళకేసి పరుగెత్తసాగాడు. తాను చాలా ఆలస్యంగా బయలుదేరాననీ, అప్పటికే తనవారికి నష్టం జరిగిపోయిందనీ అతనికి తెలుసును. అందుచేత అతను ఎంత అలుపు పుట్టినా ఆగకుండా పరుగుతీశాడు.

కాని అతను కొండలవద్దకు వచ్చి తల ఎత్తి చూసేసరికి అప్పటికే ధవళయువకుడు



కొండశిఖరం దాటి దిగి కపిలకేసి వస్తున్నాడు! రెండు నగరాలకూ మధ్యనున్న లోయలూ, అరణ్యాలూ, పచ్చిక బీడులూ అప్పటికే ధవళులవయిపోయాయి!

కపిలయువకుడు రొప్పుతూ రోజుతూ పరుగున కొండ ఎక్కి మధ్యదారిలో ధవళ యువకుణ్ణి కలుసుకున్నాడు.

"ఇదే మా సరిహద్దు!" అన్నాడు ధవళ యువకుడు, తాము కలుసుకున్నచోట ఒక కర్ర పాతుతూ.

కపిల యువకుడు నీరు కారిపోయాడు. "అన్నా, ఇది మా పశువులను మేపుకునే బీడు. నువు గెల్చుకున్నావు. మాకుకూడా కొంచెం ఇయ్యి!" అని కపిల యువకుడు ప్రాధేయపడ్డాడు, ఆయాసంతో రొప్పుతూ. ధవళయువకుడు ఒప్పుకోలేదు, కాని కపిల యువకుడు కాళ్లావేళ్లా పడసాగాడు. చివరకు ధవళ యువకుడికి అతన్ని చూసి జాలివేసింది.

"సరే, నన్ను ఎత్తుకుని కొండమీదికి ఎంతదూరం వెళతావో అంతా మీ కిచ్చేస్తాను! ఇందుకు ఒప్పుకుంటావా?" అన్నాడు ధవళయువకుడు.

కపిలయువకుడు మారు మాటాడకుండా తన ప్రత్యర్థిని భుజాలమీద ఎక్కించుకుని కొండ ఎక్కనారంభించాడు. అడుగడుగుకూ అతని గుండె ఆయాసంతో అవిసిపోయేలాగున్నది.

అతను కొద్దిదూరం మాత్రమే కొండ ఎక్కాడు. తరవాత అతనికి ఊపిరి అందలేదు. అతను పడిపోయాడు. ఆ క్షణంలోనే అతని ప్రాణాలు పోయాయి.

సరిహద్దు నిర్ణయం చూడవచ్చిన ఉభయ దేశాల ప్రజలు అతనిచుట్టూ మూగారు.

కపిలుల నాయకుడు ధవళులతో, "మీరు భూమిని సంపాదించుకున్నారు నిజమే, కాని మేమొక మహావీరుణ్ణి సంపాదించుకున్నాం!" అన్నాడు.





# దక్షిణధృవాన తొలి "నిశాచరులు"

డాక్టర్ పాల్ సిపిల్ నాయకత్వాన శాస్త్ర పరిశోధనలు సాగించటానికిగాను 1956 అఖరులో దక్షిణధృవాన ఒక పరిశోధనా కేంద్రం నిర్మించిన విషయం కిందటి నెల తెలుసుకున్నాం. డాక్టర్ సిపిల్, అయన వెంట ఉన్న పద్దెనిమిదిమందీ కూడా దక్షిణ ధృవపు "దీర్ఘరాత్రి" ఆరు మాసాలూ ఆ కేంద్రంలోనే గడిపి విచిత్రమైన అను భవాలు పొందారు. వాటినిగురించీ, వారు సాగించిన పరిశోధనలను గురించీ ఇప్పుడు తెలుసుకుందాం:

అమెరికన్ విమానాలు అనేక వందల టన్నుల సామగ్రిని ధృవప్రాంతాన పడ వేశాయి. నౌకాశాఖవారు వచ్చి శిబిరాన్ని నిర్మించారు. ఈ శిబిరంలో మనుషులుండే భాగాలూ, పరిశోధనలకు అవసరమైన భాగాలూ ఉన్నాయి. కేవలం కట్టడాలు మాత్రమే నౌకాశాఖవారు నిర్మించి తమ దారిన వెళ్లిపోయారు. ఈ శిబిరంలో నివాస యోగ్యమైన భాగాలన్నీ మంచు అడుగున, మంచుకప్పుకింద నిర్మాణమయాయి. కాని శిబిరాన్ని సర్దుకోవటందగ్గిరనుంచీ ఎంతో పని దిగబడి ఉన్నది. ఆ పనులన్నీ శిబి రంలో ఉండబోయేవారే చేసుకున్నారు.

ఇంకా సూర్యుడు అస్తమించలేదు— అస్తమించితే మరి ఆరు మాసాలదాకా ఉదయించడు! విమానాలు పడవేసిన సామగ్రిని శిబిరంలోకి చేరవేశారు. (ఇలా విమానాలు పడవేసిన కొంత సామానును గాలిగుమ్మటం—పారాషూట్—15 మైళ్లు ఈడ్చుకుపోవటంకూడా జరిగింది!) చేర వేయవలసిన సామానులలో 450 పౌనుల




నూనె్రడమ్ము లున్నాయి. వారు మంచు అడుగున రాకపోకలకు సొరంగాలు తవ్వారు, పరిశోధనకుగాను కొన్ని అదనపు కట్టడాలు కట్టుకున్నారు, రేడియో స్తంభాలు లేపారు, శాస్త్రపరిశోధనా పరికరాలు అమర్చుకున్నారు. నీరు మంచుగా మారే చలికన్న 40 డిగ్రీలు మొదలు 80 డిగ్రీలవరకూ హెచ్చుగా ఉన్న చలిలో వారందరూ ఒళ్లు విరుచుకుని పనిచేశారు.

వీరు దక్షిణధృవాన దీర్ఘరాత్రిలో—అంటే శీతాకాలంలో—నివాసం చేయబోతున్న తొలి మానవులు. వీరిపై దక్షిణధృవం తన మహిమను అనేక రకాల చూపసాగింది.



ప్రతి ఒక్కరూ చిక్కిపోయారు, కొందరు స్థూలకాయులు 30, 40 పౌనులుకూడా తీశారు. దీనితోబాటు నీరసం వచ్చేసి, వారు బరువులు ఎత్తలేకపోయారు, గట్టిగా పట్టుకోలేకపోయారు. అయితే ఈ లక్షణాలు "రాత్రి" అరంభమైన కొద్దికాలానికి పోయాయి, అందరూ మళ్లీ ఒళ్లుచేసి మామూలు మనుషులయారు.

కొంతమందికి కీళ్లబాధలు కలిగాయి. దీనికి కారణం గాలిలో ప్రాణవాయువు తక్కువగా ఉండటమూ, చలిమూలాన శరీరంలో రక్తప్రసరణ మందగించటమూ కావచ్చు. అధిక శరీరశ్రమ చేసినవారికీ, ఎక్కువగా చలిలో తిరిగినవారికీ తలనొప్పి వచ్చింది. ఈ లక్షణాలుకూడా ఆ వాతావరణానికి అలవాటుపడినకొద్దీ పోయాయి.

వీరు చేసిన పనులన్నిటిలోకీ భారమైన పని ఒక మంచుసొరంగం తవ్వటం. ఈ పనిలో ప్రతి ఒక్కరూ పాల్గొన్నారు, ఇందుకుగాను వారు రెండే రకాల అయుధాలు—మంచుగొడ్డలీ, బొగ్గుల పారా—ఉపయోగించారు. ఈ సొరంగం ఏటవాలుగా 90 అడుగుల లోతుకు వెళ్లింది. దీని పొడుగు 90 గజాలు, దీని వెడల్పు 6 మొదలు 11 అడుగులు, ఎత్తు 7 మొదలు 20 అడు



గులు. ఇందులో అస్తమానం ఒకే ఉష్ణోగ్రత—మంచుచలికి 60 డిగ్రీలు తక్కువ—ఉంటూ వచ్చింది.

ఈ సొరంగాన్ని తవ్వటానికి 8 మాసాలు పట్టింది. దీనివల్ల రెండు ప్రయోజనాలు: ఒకటి, ఇది శిబిరానికి మంచినీరు సరఫరా చేసింది; రెండు, పురాతనపు మంచు ముక్కలను తవ్వితెచ్చి వాటిద్వారా పరిశోధనలు జరిపారు.

ఈ చలిలో మంచు తవ్వటం మాటలు కాదు. ఒక్కొక్క మనిషీ గంటకు 600 పౌనులు మంచు తవ్వేవాడు. అరటన్ను మంచు తవ్వేసరికి మనిషి పని అయిపోయేది—కాని ఉత్సాహంతో టన్ను మంచు తవ్వినవారుకూడా ఉన్నారు. మూడు గంటలు పనిచేసేసరికి ఒళ్లు విగిరినట్టయిపోయేది. పని ప్రారంభించిన గంటసేపటి దాకా శరీరమంతా చెమటలు పొయ్యటమూ, చెమటమీద చలవ కమ్మటమూ, శిబిరంలోకి తిరిగివచ్చాక ఎన్నో గంటలకుగాని తిరిగి శరీరం వేడెక్కకపోవటమూ జరిగేది.

1957 మార్చి 22 న సూర్యుడు అస్తమించాడు. కొద్దిరోజులపాటు సంధ్యాకాంతి ఉండి తరవాత రాత్రి అరంభమయింది. ఈ రాత్రి యావత్తూ సిపిల్ మొదలైనవారు శిబిరాన్నే అంటిపెట్టుకుని ఉండి, అవసర



మైనప్పుడు మాత్రమే, అదికూడా చాలా కొద్దిసేపు, పైకి వస్తూ ఉండేవారు.

శిబిరం విశాలమైనది. అందులో 6000 చదరపు అడుగుల నేల ఉన్నది. అందరూ పడుకునే చోటనే మనిషికి దాదాపు నూరు చదరపు అడుగుల నేల ఉన్నది. చలి విపరీతంగా ఉన్నచోట మనుషులు ఎంత తక్కువ జాగాలో పడుకుంటే అంత వెచ్చగా ఉంటుంది.

దక్షిణధృవాన నీటికొరత లేకపోయినా సాధారణంగా ఇక్కడికి వచ్చే అన్వేషకులు వారాలతరబడి స్నానాలు చేసేవారుకారు. అయితే ఈ శిబిరం చాలా నాగరికమైనది. ఇక్కడ స్నానానికి వేడినీరూ, చన్నీరూ, బట్టలు ఉతికే యంత్రమూ, బట్టలను ఆర బెట్టే విద్యుద్యంత్రమూ, నేలను ఊడ్చే "వాక్యూమ్ క్లీనర్", ప్రతి మనిషి పడుకునే అరకూ ఒక విద్యుద్దీపమూ, నేలపైన "లినోలియం", వారానికి మూడు సినిమా ప్రదర్శనాలూ ఉండేవి. రోజూ మంచు తవ్వే పని ఉంటూఉండటంవల్ల మనిషికి రోజూ మూడు కిరసనాయిలు డబ్బాల నీరు లభించేది.

భోజనం విషయంలోకూడా ఎలాటి లోపమూ ఉండేదికాదు. అసలు సంగతి ఈ శిబిరానికి అత్యుత్తమమైన వంటవాడు దొరికాడు. ఆయన పేరు చెస్టర్ సెగర్స్. ఆయన వంట అద్భుతంగా చెయ్యటమే గాక అందరినీ తృప్తిపరిచేలాగాకూడా చూసుకునే వాడు. తాను చేసే వంటకాలలో ఏదైనా కొందరికి నచ్చదని తెలిస్తే వారికి నచ్చేది విడిగా చేసేవాడు. కొందరు ఆయనను వింత వింత వంటకాలు కోరేవారు. ఆయన వాటిని చేసిపెట్టేవాడు. గంగాళాలతో "ఐస్ టీ" తయారుచేసి అందరికీ పోసే వాడు. ఏ కారణంచేతనోగాని వారికి అన్న పానీయాలకంటె ఇది అంటే ఎక్కువ ఇష్టంగా ఉండేది. —(ఇంకా వుంది)






# అహింసాజ్యోతి

[ 8 ]

బింబిసారుడు పరిపాలించే కాలంలో రాజగృహంలో కాలవలి అనే ఒక పేదవా డుండేవాడు. ఒకనాడు వాడికెక్కడా పని దొరకలేదు. అందుచేత వాడి భార్య ఆ రోజు ఇంత అంబలి కాచింది. బుద్ధుడి శిష్యులలో ఒకడైన మహాకాశ్యపుడు అనాడే ఆ పేద వాడి ఇంటివద్దకు భిక్షాపాత్రతో వచ్చాడు. కాలవలి భార్య తనకున్న అంబలే భిక్షా పాత్రలో పోసింది. మహాకాశ్యపుడు ఆ అంబ లిని తీసుకుపోయి బుద్ధుడి కిచ్చి, "ఈ అంబలి పోసిన స్త్రీకి కలిగే ప్రతిఫలం ఏమిటి ?" అని అడిగాడు.

"ఒక వారం రోజులలో ఈ స్త్రీ గొప్ప ఇంటిదవుతుంది," అన్నాడు బుద్ధుడు.

ఇది జరిగిన ఏడవ రోజున రాజుగారు శ్మశానంమీదుగా వెళుతూ అక్కడ కొరత బడి ఇంకా ప్రాణాలతో ఉన్న నేరస్థుణ్ణి ఒకణ్ణి చూసి, "నావల్ల నీకు కావలిసిన ఉపకారం ఏమైనా ఉన్నదా ?" అని అడిగాడు.

"నాకు ఆకలిగా ఉన్నది. రాజభవనం నుంచి నాకు భోజనం పంపించాలి!" అని నేరస్థుడు అడిగాడు.

రాజుగారు వాణ్ణి చూసి జాలిపడి సరే నన్నాడు. ఆ రాత్రి ఆయన తన అధికారు లతో, "శ్మశానంలో కొరతపడిన వాడికి ఎవరిచేతనైనా నా వంటశాలనుంచి భోజనం పంపండి!" అన్నాడు.





కాలవలిభార్య సరేనని తాటిచెట్టు వద్దకు రాగానే, "ఓ సుమనా, నీ కూతురు కాళికి మగపిల్లవాడు పుట్టాడు!" అని కేక పెట్టింది.

తాటిచెట్టుపైన ఉన్న సుమనుడు, "చాలా మంచివార్త తెచ్చావు! ఈ తాటి చెట్టు మొదట్లో నిధి ఉన్నది, బహుమానంగా దాన్ని తవ్వుకు పో!" అని కేక పెట్టాడు.

ఆ స్త్రీ అక్కడినుంచి బయలుదేరి శ్మశానంలో కొరతపడిన నేరస్థుడి వద్దకు వెళ్లి, "రాజుగారి ఇంటినుంచి భోజనం తెచ్చాను, తింటావా?" అన్నది.

శరీరబాధకన్న ఆకలిబాధ ఎక్కువగా ఉండటంచేత వాడు, "పెట్టు!" అని, ఆమె చేత పెట్టించుకుని అవురావురుమని అన్నం తినేశాడు. తరవాత వాడు ఆమెను, "నా మూతి కాస్త తుడు!" అన్నాడు. మూతి తుడవటానికి దగ్గిరికి రాగా వాడామె జుట్టును తన నోటితో గట్టిగా పట్టి వదలలేదు.

చేసేది లేక కాలవలి భార్య తన వెంట తెచ్చిన కత్తితో వాడి నోట చిక్కిన జుట్టును కోసేసి రాజభవనానికి తిరిగి వచ్చింది. "నువు శ్మశానానికి వెళ్లి నేరస్థుడికి అన్నం పెట్టినట్టు రుజువేమిటి?" అని రాజుగారు అడగగా ఆమె, "మహారాజా, నేను కోసేసిన జుట్టు నేరస్థుడి నోట కనిపిస్తుంది. అదీగాక

శ్మశానానికి ఆ నిశిరాత్రివేళ ఆహారం తీసుకుపోయే మనిషి వారికి దొరకలేదు. కాలవలి భార్య అందుకు సమ్మతించింది. ఆమె శ్మశానానికి పోతూండగా దారిలో ఒక చెట్టుమీద ఉండే పిశాచం, "ఆ భోజనం నాకేనా ఏమిటి?" అని ప్రశ్నించింది.

"కాదు, శ్మశానంలో ఉన్న ఇంకొక మనిషికి!" అని స్త్రీ జవాబు చెప్పింది.

"ఇదుగో చూడూ! నువు వెళ్లే దారిలో ఫలాని తాటిచెట్టుపైన దేవసుమనుడు వుంటాడు. ఆయనతో, నీ కూతురు కాళి మగ పిల్లవాణ్ణి కన్నదని కేకవేసి చెప్పిపోగలవా?" అన్నది పిశాచం.





దారిలో ఉన్న తాటిచెట్టు మొదట్లో నిధి ఉన్నదనీ, దాన్ని తవ్వి తీసుకోమనీ నాతో పిశాచాలు చెప్పాయి!" అన్నది.

మర్నాడు రాజుగారు ఆమె చెప్పిన రెండు విషయాలనూ రుజువుచేసుకున్నాడు. తాటిచెట్టు మొదట తవ్వగా ఆ పేదస్త్రీ చెప్పినట్టే నిధి దొరికింది. రాజుగారు ఆమె ధైర్యానికీ, అదృష్టానికీ మెచ్చి ఆమెకూ, ఆమె భర్తకూ అగ్రస్థానం ఇప్పించాడు. బుద్ధుడు చెప్పిన మాట నిజమయింది.

* * *





రాజగృహం సమీపంలో ఏకనాలకం అనే గ్రామం ఉండేది. ఆ గ్రామంలో కాశీ భారద్వాజుడనే బ్రాహ్మణు డుండేవాడు. ఆయన ఒక ఏడు పొలాలు దున్నే ఉత్సవం ఏర్పాటు చేశాడు. ఆ కాలంలో ఇది ఒక గొప్ప పండగ. ఈ ఉత్సవానికి అయిదు వందల నాగళ్లకు వెయ్యి ఎడ్లను కట్టారు. ఎద్దుల గిట్టలకు వెండిరేకులు తొడిగారు. వాటి మెడలకు పూలమాలలు చుట్టారు. నాగళ్లకూ ములుకోలలకూ బంగారు పొన్నులు వేశారు. కాడి పట్టేవాళ్లంతా రంగు రంగుల బట్టలు ధరించారు. వేలాది జనం ఉత్సవం చూడవచ్చారు. ఈ ఉత్సవం చూడటానికి బుద్ధుడుకూడా వచ్చాడు. ఆసమయంలో ఆయన దక్షిణగిరి అనే విహారంలో ఉంటున్నాడు.

ఉత్సవానికి ముందుగా బ్రాహ్మణుడి భార్య బండిపై వేసి తెచ్చిన అన్నమూ, నెయ్యీ, మిఠాయి మొదలైనవి అందరికీ పంచిపెట్టింది. బ్రాహ్మణుడు ఎవరి కేమి కావాలో కనుక్కుంటూ, "ఇక్కడ అన్నం వడ్డించు. ఇక్కడ నెయ్యి వడ్డించు," అని తన భార్యను హెచ్చరిస్తూ వచ్చాడు.

భోజనాలు ముగిసినదాకా బుద్ధుడు ఒక ఎత్తయిన చోట నిలబడ్డాడు. ఉత్సవానికి వచ్చిన జనం ఉత్సవంమాట మరిచిపోయి ఆయనచుట్టూ మూగారు. ఇదిచూసి బ్రాహ్మ








మీరు కృషి చేస్తామంటున్నారుగాని మీ నాగలీ, ములుకోలా, ఎద్దులూ మొదలైనవి కనిపించవే!" అన్నాడు.

"నేను ధర్మమనే పొలాన్ని, జ్ఞానమనే నాగలితో దున్ని, పవిత్రత అనే విత్తులు చల్లి, నియమాచరణ అన్న వ్యవసాయంతో నిర్వాణమనే పంట పండిస్తాను; జన్మకాంక్ష అనే కలుపు తీస్తాను!" అని బుద్ధుడు జవాబు చెప్పాడు. తరవాత ఆయన బ్రాహ్మణుడితో, "నీవుకూడా ఇలాటి కృషి ప్రారంభించు!" అన్నాడు.

బ్రాహ్మణుడు బుద్ధుడి బోధలు విని సంతోషించి ఆయనకు మేలైన ఆహారం ఇవ్వబోయాడు. కాని బుద్ధుడు దాన్ని నిరాకరించి, "ప్రజలకు వినోదం చేకూర్చి ప్రతిఫలం పొందటానికి నేను గాయక నర్తకులలాటివాణ్ణి కాను. ప్రబోధించినందుకు ప్రతిఫలం పుచ్చుకోవటం నా నియమాలకు విరుద్ధం!" అన్నాడు.

బుద్ధుడికి నివేదించిన ఆహారం మరొకరికి పెట్టటం అనుచితంగా తోచినందువల్ల దాన్ని బ్రాహ్మణుడు నీటిలో వదిలిపెట్టి, బుద్ధుడి వెంట చేరి కాలక్రమాన అర్హతుడయాడు.

శ్రావస్తినగరంలో అనేపీడుడు అనే ఒక కోటీశ్వరుడుండేవాడు. ఆయనకు రాజ

ణుడు, "ఈ సన్యాసి ఉత్సవం పాడుచేయ వచ్చినట్టున్నది!" అని విసుక్కున్నాడు.

ఆయన బుద్ధుడివద్దకు వెళ్ళి, "అయ్యా, శ్రమణా! నేను భూమిని దున్ని, విత్తులు చల్లి, పంట పండించి, కృషిఫలితాన్ని అనుభవిస్తున్నాను. నీవుకూడా నాలాగే కృషి చేసినట్టయితే తిండికి ఏలోటూ లేకుండా సుఖంగా ఉండవచ్చుగద!" అన్నాడు.

"ఓ బ్రాహ్మణా! నేనూ నీలాగే కర్షకుణ్ణే. అయితే నేను పండించే పంట అమృతమయమైనది!" అన్నాడు బుద్ధుడు.

బుద్ధుడి మాటలు బ్రాహ్మణుడికి అర్థం కాలేదు. అందుచేత ఆయన "అయ్యా,





గృహంలో ఉండే ఒక వర్తకుడు అప్త మిత్రుడు. ఒకరి ఊరికి మరొకరు వచ్చినప్పుడల్లా వారు ఎంతో ఆప్యాయంగా ఎదురు వెళ్లి, ఇంటికి తెచ్చి ఆదరిస్తూండేవారు.

ఒకసారి అనేపీడుడు అయిదువందల బళ్లపై సరుకు వేసుకుని రాజగృహానికి బయలుదేరి వచ్చాడు. తన మిత్రుడు ఊరి బయట తనకు ఎదురు రాకపోవటం చూసి ఆశ్చర్యపోయాడు.

అనేపీడుడు తన మిత్రుడుండే వీధికి వచ్చాడు, ఇంటికికూడా వచ్చాడు; మిత్రుడు ఎదురు రాలేదు. అనేపీడుడు ఇంట్లోకి వెళ్లి తన మిత్రుణ్ణి చూశాడు. కాని అయన ఏదో పనితొందరలో ఉన్నవాడిలాగా అనేపీడుడితో లాంఛనగా రెండు మాటలు మాట్లాడి తన పని తాను చూసుకున్నాడు.

ఆ రాత్రిమటుకు ఆ మిత్రుడు అనేపీడుడి వద్దకు వచ్చి, "నేను నీ సంగతి సరిగా విచారించనందుకు మరొకలాగ అనుకోకు. రేపు బుద్ధుడికీ, అయన పరివారానికీ ఆతిథ్యం ఇస్తున్నాను. పనితొందరలో నీతో మాట్లాడే అవకాశం లేకపోయింది," అన్నాడు.

బుద్ధుడి పేరు చెవిని పడగానే అనేపీడుడికి అయనను అప్పటికప్పుడే చూడాలన్న కోరిక కలిగింది. కాని అతని మిత్రుడు, "ఇప్పు



డాయన పడుకుని నిద్రపోతూంటారు. మనం వెళ్లితే నిద్రాభంగమవుతుంది!" అన్నాడు.

చేసేది లేక అనేపీడుడు వెళ్ళి పడుకున్నాడు. కాని ఒక జాము గడిచేసరికల్లా అతనికి మెలుకువ వచ్చింది. బయట చూస్తే వెలుతురుగా వున్నది. తెల్లవారిపోయిందనుకుని అనేపీడుడు బయటికి వచ్చి, తాను చూసిన వెలుతురు వెన్నెల అని గ్రహించి, మళ్ళీ లోపలికి వెళ్లి పడుకున్నాడు. మరొక జాము గడిచాక అనేపీడుడు తిరిగి ఇదే భ్రమకు లోనయాడు. అయన మూడవ జామున మూడవసారి లేచి, "ఈసరికి నిజంగా తెల్లవారేవుంటుంది. నేను విహా






రానికి బయలుదేరి బుద్ధుడి దర్శనం చేసుకుంటాను!" అనుకుని బయలుదేరాడు.

ఆయన దారిలో ఇలా వితర్కించుకున్నాడు: "ఈ కాలంలో బుద్ధులమని చెప్పుకుంటూ తిరుగుతున్నవారు చాలా మంది ఉన్నారు. నేను మోసపోతానేమో! నా తల్లిదండ్రులు చిన్నతనంలో నన్ను సుదత్తుడని పిలిచేవారు. ఈ సంగతి ఎవరికీ తెలియదు. ఈ బుద్ధుడు నా చిన్ననాటి పేరు చెప్పాడా, ఆయనను నమ్ముతాను. లేదా, ఇంకొక బుద్ధుణ్ణి వెతుక్కుంటాను!"

అనేపీడుడు విహారం ప్రవేశించగానే బుద్ధుడే స్వయంగా ఎదురుపడి, "రా,



సుదత్తా!" అని పలకరించాడు. ఈ పిలుపుతో అనేపీడుడి సందేహాలన్నీ పటాపంచలయిపోయి అతనికి బుద్ధుడిలో పూర్తి విశ్వాసం కుదిరింది. అతను తన జీవితాంతం వరకూ బుద్ధుణ్ణి ఆశ్రయించ నిశ్చయించాడు.

బుద్ధుడు అనేపీడుడికి ధర్మం ఉపదేశించాడు. అనేపీడుడు బుద్ధుణ్ణీ, ఆయన పరివారాన్నీ మర్నాడు తన భిక్ష స్వీకరించమని ప్రార్థించాడు. ఇందుకయ్యే ఖర్చు సమస్తమూ తానే భరించి, తన మిత్రుడి సహాయమూ, తదితరుల సహాయమూ నిరాకరించాడు. భిక్ష అయిపోయాక ఆయన బుద్ధుణ్ణి శ్రావస్తికి రావలిసిందిగా ఆహ్వానిస్తూ, "శ్రావస్తి రాజు మూడువందల యోజనాల పరిమితి గల కాశీ కోసల దేశాలను పరిపాలిస్తున్నాడు. నేను మహా ధనికుణ్ణి. మీరు వేంచేసినట్టయితే మీకు ఏలోటూ లేకుండా అన్ని ఏర్పాట్లూ చేయగలను," అన్నాడు.

రాజగృహంనుంచి శ్రావస్తికి 45 యోజనాలు. ఈ మధ్య గల మార్గంవెంబడి బుద్ధుడికోసం అనేపీడుడు చక్కని మజిలీలు ఏర్పాటు చేయించి, దారి అంతా అలంకరింపజేశాడు. బుద్ధుడికోసమూ, ఆయన పరివారంకోసమూ విహారం నిర్మించ





టానికి యోగ్యమైనదిగా ఒక స్థలం ఎన్ను కున్నాడు. ఆ స్థలం అయిదువందల గజాల చదరం. అది జేతుడనే రాజుది.

అనేపీడుడు జేతుడి వద్దకు వెళ్ళి, "మీ స్థలం అమ్ముతారా ?" అని అడిగాడు.

"అది మీకు కావాలంటే దాని మేర యావత్తూ బంగారు మసురణాలు పరిచి ఇస్తే ఆ వెలకు అమ్ముతాను," అన్నాడు జేతుడు, అమ్మనని నోటితో అనకుండా.

"బంగారు మసురణాలు పరుస్తాను, ఆ స్థలం అమ్మండి!" అన్నాడు అనేపీడుడు.

ఆయన నిజంగా కొనే ఉద్దేశంతో వున్నా డని తెలియగానే జేతుడు ఆ స్థలాన్ని అమ్మ ననేశాడు. కాని అనేపీడుడు అమ్మితీరాలనీ, బేరం కుదిరిందనీ పట్టుపట్టాడు. వ్యవహారం న్యాయస్థానానికెక్కింది. న్యాయస్థానంలో అనేపీడుడికి అనుకూలంగా తీర్పుచెప్పారు.

అనేపీడుడూ జేతుడూ కలిసి ఆ స్థలానికి వెళ్లారు. మామిడిచెట్లూ, గంధపుచెట్లూ మొదలైనవి తప్ప మిగిలిన చెట్లన్నిటినీ అనే పీడుడు కొట్టించి, ఆ చోటంతా సమం చేయించాడు. తరవాత ఆయన తన సొత్తంతా తెప్పించి తాను కొన్న చోటంతా మసురణాలు వెయ్యిమంది మనుషులచేత పరిపించాడు. చెట్లున్నచోట అవి లేకపోతే





అక్కడ ఎన్ని మసురణాలు పరచటానికి వీలుండేదో అవికూడా లెక్కలో చేర్పించాడు.

అనేపీడుడి తాత ముత్తాతలు ఏడు తరా లుగా కూడబెట్టిన బంగారునాణాలు బయ టికి వచ్చాయి. 18 కోట్ల మసురణాలు పరచటం అయింది, కాని ఇంకా పరచ వలిసిన జాగా వున్నది.

"ఈ అనేపీడుడు ఎంత పుణ్యం సంపా దించబోతున్నాడో తెలియదు. 18 కోట్ల మసురణాలు పరిచాడు. ఇంకా అన్ని పరచ టానికికూడా సిద్ధంగావున్నాడు. నేనుమాత్రం కొంత పుణ్యం యెందుకు సంపాదించ గూడదు?" అనుకుని జేతుడు అనేపీడుడితో,

"ఇక చాలు! నా స్థలం ఖరీదు నాకు ముట్టింది!" అన్నాడు.

తరవాత అనేపీడుడు విహారభవనాలు నిర్మించాడు. బౌద్ధసన్యాసులు ఉండటానికీ, పగలు సమావేశాలకూ, రాత్రి నిద్రకూ వేరు వేరు భవనాలు కట్టారు; కోనేరులు తవ్వారు; పుష్ప ఫలవృక్షాల తోటలు వేశారు. ఈ ఆవరణ చుట్టూ అనేపీడుడు 2 వేల గజాల నిడివి గల ప్రహరీగోడ తొమ్మిది గజాల ఎత్తున కట్టించాడు.

ఈ విహారం నిర్మించటంలో అనేకమంది మిత్రులు అనేపీడుడికి శరీర సహాయమూ, ధనసహాయమూకూడా చేశారు. వీటన్నింటి కిందా మరి 18 కోట్లు ఖర్చయింది.

ఇదంతా చూసిన మీదట జేతుడికి తన స్థలం తాలూకు 18 కోట్లు ఉంచుకో బుద్ధి పుట్టలేదు. ఆయన ఆ సొమ్ముతో విహారం నాలుగు పక్కలా నాలుగు దివ్య భవనాలు, ఏడేసి అంతస్తులు గలవి, కట్టించేశాడు.

ఈ విధంగా 54 కోట్ల మసురణాల ఖర్చుతో జేతవనం తయారయింది. ఈ ఏర్పాట్లన్నీ పూర్తి కాగానే బుద్ధుడికి ఆహ్వానం వెళ్లింది. ఆయన తన అనుచరులతో బయలుదేరి పదహారేసి మైళ్లకు మజిలీ చేస్తూ రాజగృహంనుంచి శ్రావస్తికి చేరుకున్నాడు. నగరం వెలపల బుద్ధుడికి ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు ఎదురు వచ్చింది. దాని వెంబడి అనేపీడుడూ, ఆయన ఇద్దరు కుమార్తెలూ ఉన్నారు.

అనేపీడుడు బుద్ధుణ్ణి విహారానికి తీసుకుపోయి, "దీనిని ఎవరి పేర ధారపోయమన్నారు?" అని అడిగాడు.

"ఇప్పుడున్న బౌద్ధులకూ, ముందు రాబోయే బౌద్ధులకూ ఈ విహారాన్ని అంకితం చెయ్యి!" అని బుద్ధుడు అనేపీడుణ్ణి ఆదేశించాడు. అనేపీడుడు విహారాన్ని బౌద్ధ సన్యాసులకు అంకితం చేసేశాడు.

—(ఇంకా వుంది)






# కోతులు

నీవేదైనా చిలిపిపని చేసినప్పుడు పెద్దవాళ్లకు కోపంతోపాటు నవ్వుకూడా వస్తే ఏమని తిడతారు? "కోతివెధవా!" అంటారు. అది తిట్టు కాదు. ఎందుకంటే కోతులను చూసి ఆనందించనివాళ్లు భూప్రపంచంలో ఎవరూ ఉండరు.

వెనకటికి ఒక సర్కసువాడు ఎంతో ఖరీదు పెట్టి ఖడ్గమృగాన్ని కొన్నాడట. మర్నాడు ఉదయం వెళ్లి చూస్తే ఖడ్గమృగం బోను ముందు ఒక్క మనిషి నిలబడి చూస్తున్నాట్ట; కోతుల బోనుదగ్గిర వందలాది జనం చేరారట!

జంతు ప్రదర్శనశాల వద్దకు వెళ్లినా ఇదే జరుగుతుంది. మనం మిగిలిన జంతువులన్నిటినీ కలిపి ఎంతసేపు చూస్తామో ఒక్క కోతులను అంతసేపు చూస్తాం.

తమాషా ఏమిటంటే, మనకు కోతులను చూడటం ఎంత ఆనందంగా ఉంటుందో, మనకు కనిపించటంకూడా వాటికి అంత ఆనందంగానూ ఉంటుంది. మనం చూస్తున్నాంగదా అని అవి చాలా గర్విస్తాయి, మనకోసం అనేక "కోతిపనులు" చేస్తాయి.

మనకూ, కోతులకూ మధ్య ఇంత ఆకర్షణ ఉండటానికి కారణం బహుశా మనమధ్యగల దూరపు బంధుత్వం కావచ్చు. మనమూ కోతులూకూడా ఒకే పూర్వీకులనుంచి పరిణామం చెందాం. కోతిలో మనిషి లక్షణాలు



కోతి బుద్ధులు

ఎన్నో ఉన్నాయి. మనుషుల మనస్తత్వాలను కోతులు నగ్నంగా ప్రదర్శిస్తున్నట్టు తోస్తుంది; వాటిని చూస్తూంటే.

మనం అనాదిగా కోతులకు అగ్రస్థానం ఇస్తూవస్తున్నాం. రామాయణంలో రాముడు రావణాసురుణ్ణి ఓడించటానికి కోతిమూకను వెంట తీసుకుపోయాడు. మహాబలుడూ, మహావీరుడూ అయిన హనుమంతుడు మనకు దేవుడు.

కోతిని దేవుడుగా ఆరాధించినది మన భారతీయులు ఒక్కరే కాదు, ప్రాచీనకాలంలో ఈజిప్టు దేశస్థులు ఒక రకమైన కోతిని పూజించేవారు.

చీనాదేశపు ప్రాచీన కథలలో కూడా కోతిదేవు డున్నాడు.

నిర్బంధంలో ఉండే కోతులు రెండు, మూడు రకాలుగా ఉంటాయి. కొన్ని జంతు ప్రదర్శనశాలల్లో ఉంటాయి, మరి కొన్నిటిని కొందరు మచ్చిక చేస్తారు. ఇలా మచ్చిక చేసిన కోతులనే బిచ్చగాళ్లు తెచ్చి ఇళ్లముందు ఆడిస్తారు. నిర్బంధంలో ఉన్న కోతులనే మనం పరిశీలించటానికి ఎక్కువ అవకాశం ఉంటుంది.

జంతు ప్రదర్శనశాలలో ఉండే కోతులు తమను చూడవచ్చేవారిపట్ల చాలా శ్రద్ధ కనబరుస్తాయి. (పులులూ, చిరుతపులులూ చాలా నిర్లక్ష్యంగా ఉంటాయి.) కోతులు కనబరిచే శ్రద్ధకు కారణం స్వార్థమే కావచ్చు— తినేటందుకు ఏదైనా ఇస్తామని! అవి మనని అప్పుడప్పుడూ నోళ్లు తెరిచి, కోరలు చూపి, భయపెడతాయి. అదంతా కోపమని మనం అనుకోనవసరం లేదు; అవి నవ్వటం అలాగే ఉంటుంది.

తిండి విషయంలో కోతులు స్వార్థంగా ప్రవర్తించి, ఆఖరుకు తమ పిల్లలకుకూడా అందనివ్వకుండా దొరికిన ఆహారం తినేస్తాయి. అయితే కోతిపిల్లలుకూడా త్వరలోనే ఈ విద్య నేర్చుకుంటాయి గనక అటే బాధఉండదు. కోతులను తిట్టితేకూడా వాటికి అర్థమవుతుంది. అవి మంచితనానికి కట్టుబడతాయి గాని, తిట్లకూ దెబ్బలకూ ఏమాత్రమూ లొంగవు.

కోతులు ఒకదాని శరీరాలలో ఒకటి పేలు చూసుకోవటం మనకు తెలుసు. మధ్యమధ్య అవి ఏదో తీసుకుని నోట్లో పెట్టుకుంటాయి. కోతులకు పేలుండవనీ, ఈ నోట్లో పెట్టుకోవటం ఉత్త అభినయమనీ కొందరి నమ్మకం. ఇది నిజం కాదు. కోతులకు పేలు ఉండని మాట నిజమే, అవి నోట్లో పెట్టుకునేది ఊడివచ్చిన చర్మపు నలుసులు; అవి ఉప్పగా, కోతులకు రుచిగా ఉంటాయి.

కోతులు సాధారణంగా అన్నమూ, పప్పులూ, పళ్లూ తింటాయి. కాని అవి అచ్చగా శాకాహారులుకావు. చాలా కోతులు కీటకాలనూ, కొన్ని కోతులు సాలీళ్లనూ ఆత్రంగా తింటాయి.

కోతులలో తోక లున్నవీ, తోకలు లేనివీ రెండు రకాలు. తోకలు లేనివాటిని వాలిడి కోతులంటారు. వీటిని గురించి తరవాత తెలుసుకుందాం.

తోక లుండే కోతులలో 500 రకాలున్నాయి. కొద్ది జాతులు మినహాయిస్తే మిగిలినవన్నీ భూమియొక్క ఉష్ణమండలాన్నే అంటిపెట్టుకుని ఉన్నాయి. ప్రపంచంలో కోతులు లేని ఖండం ఆస్ట్రేలియా ఒక్కటే.

ఈ కోతులలో అతి చిన్నదైన కోతి ఉడతల ప్రమాణంలో ఉండి, 10 తులాల బరువు మాత్రమే ఉంది. దీన్ని అరిచేతిలో పొదివి పట్టుకోవచ్చు. అన్నిటికన్న పెద్ద కోతి 165




"హెమద్రియాస్" కోతులను ఈజిప్టులో పూజించేవారు



మార్మొసెట్-కోతి కొంచెం తోక ఘనం

పౌనుల బరువుకూడా ఉంటుంది. అన్నిటికన్న చిన్న కోతిని "మార్మొసెట్" అంటారు, అన్నిటి కన్న పెద్దకోతి ఆఫ్రికాలోని బబూన్‌కోతి.

సాధారణంగా సృష్టిలో నాలుగు కాళ్ల జంతువులున్నాయి, రెండు కాళ్లూ, రెండు చేతులూ గల మనుషులున్నారు. కాని కోతికి నాలుగు కాళ్లూ, నాలుగు చేతులూనూ! అది అన్ని కాళ్లనూ చేతులుగా ఉపయోగిస్తుంది. కొన్ని కోతులకు అయిదో చెయ్యికూడా ఉంటుంది—తోక. ఈ తోకతో అవి వస్తువులను పట్టుకుని దగ్గిరికి లాక్కుంటాయి, దాని సహాయంతో చెట్లెక్కుతాయి, తోకతో చెట్టు కొమ్మ పట్టుకుని నాలుగు కాళ్లూ గాలిలో ఉంచి వేళ్లాడతాయికూడా! అయితే ఈ "అయిదో చెయ్యి" అన్ని కోతులకూ లేదు. చాలా కోతులు తోకలను "తూకానికి" మాత్రమే ఉపయోగిస్తాయి.

కోతులకు జ్ఞానతృష్ణ హెచ్చు. అవి కొత్త వస్తువును చూసినప్పుడు దాన్ని కదిలించి, తిప్పి, పగలదీసి, చేతులతో విచ్చకపోతే తమ బలమైన దంతాలతో కొరికి చూస్తాయి. చెయ్యటానికి బొత్తిగా ఏమీ లేనప్పుడు తప్ప అవి కదలకుండా కూచోవు.

కోతులు చిన్న గుంపులలోనూ, పెద్ద మందలుగానూకూడా జీవిస్తాయి. ఆడ కోతులు సామాన్యంగా తడవకు ఒక పిల్లనే కంటాయి. ఆ పిల్లను పొట్టకు కరుచుకుని చెట్లెక్కటమూ, పరిగెత్తటమూ మొదలైన నిత్యకృత్యాలన్నీ చేస్తాయి. ఎప్పుడైనా కోతులు కవలలను కనటంకూడా జరుగుతుంది. పూర్వార్థగోళంలో (ఆసియా, యూరప్, ఆస్ట్రేలియాలలో) ఉండే కోతులకూ, పశ్చిమార్థ గోళంలో (ఉత్తర, దక్షిణ అమెరికాలలో) ఉండే కోతులకూ కొన్ని తేడాలున్నాయి. పశ్చిమార్థగోళంలో ఉండే కోతులే తోకలను పట్టుకోవటానికి ఉపయోగించగలవు. వాటికి నాలుగు దంతాలు హెచ్చుగా ఉంటాయి. పూర్వార్థగోళంలో ఉండే కోతులకు మనుషులకు ఉన్నన్ని దంతాలే ఉంటాయి; వాటి దవడలకు ఆహారపు సంచులుంటాయి; వాటి నాసికారంధ్రాలు దగ్గిరిగా ఉంటాయి.

అన్ని కోతులలోకీ చిన్నవైన మార్మొసెట్ కోతులు అమెరికాలోని అత్యుష్ణ మండలపు అడవులలో మందలు మందలుగా ఉంటాయి. వీటికి కోతుల ఆకారంకూడా ఉండదు. వీటి వేళ్లు పక్షుల గోళ్లలాగా ఉంటాయి.

మరొక చిన్నరకం కోతిని "గుడ్లగూబ" కోతి అంటారు. ఇది పగలంతా నిద్రపోయి, రాత్రివేళ సంచారానికి బయలుదేరుతుంది. ఇవి పిల్లులలాగా చీకటిలో బాగా చూస్తాయి. వీటి కళ్లు చాలా పెద్దవి. ఇవి చెట్ల తొర్రలలో నివసిస్తాయి.

దక్షిణ అమెరికాలోని కోతులలో కెల్లా పెద్దవి "బొబ్బ" కోతులు. ("ప్రకృతి వింతలు"లో కుమేవావా వీటిని మీకు పరిచయం చేశాడు.) బొబ్బ కోతులలో ఎర్రవీ, నల్లవీ రెండు రకాలున్నాయి. ఇవి చాలా ఎత్తయిన చెట్లమీద మందలుగా నివసిస్తాయి. వీటికి కంఠాలలో బలం చాలా జాస్తి. ఇవి అరిస్తే ఎంతో దూరానికి వినపడుతుంది. వీటికి తడి కొంచెం కూడా గిట్టదులాగుంది. వాన ప్రారంభమై చినుకులు మీద పడగానే ఈ కోతులు బొబ్బలు పెట్టనారంభిస్తాయి.

"బబూన్" కోతులు ఒక ప్రత్యేకమైన జాతి. ఇవి చెట్లెక్కటంలో ఇతర కోతులకు ఏమాత్రమూ తీసిపోకపోయినప్పటికీ, చెట్ల మీద నివసించక నేలపై నివసిస్తాయి. వాటి




బొబ్బ కోతులు



నామాల కోతి

తోకలు కొంచెం పొట్టివిగానూ, మూతులు కొంచెం పొడుగుగానూ ఉంటాయి. వీటికి ఆహారపు సంచులుంటాయి. ఇవి చాలా పెద్ద కోతులు, అమిత బలం గలవి, సాహసంతో కూడినవి. ఇవి మందలుగా నివసిస్తాయి. మనిషి వీటి జోలికి పోవటం చాలా ప్రమాదకరం. పశ్చిమ ఆఫ్రికాలో ఉండేవారు, తమ పొలాలను బబూన్ కోతుల మందలు నాశనం చేస్తున్నా చూస్తూ ఊరుకుంటారు. వీటిపాలిటి మృత్యుదేవత చిరుతపులి ఒక్కటే. అది కనిపిస్తే చాలు బబూన్‌లు కిచకిచలాడుతూ చెల్లాచెదరుగా పారిపోతాయి కాని కొన్ని మగ బబూన్ కోతులు పారిపోకుండా నిలబడి చిరుతపులిని తరిమికొట్టిన సమయాలుకూడా ఉన్నాయి.

బబూన్ కోతులలో చాలా రకాలున్నాయి. వాటిలో కెల్లా రంగులతో విలసిల్లేవి "డ్రిల్" "మాండ్రిల్" అనే రకాలు. "మాండ్రిల్" కోతిని మనవాళ్లు "నామాల కోతి" అంటారు. ఎందుచేతనంటే వాటి బుగ్గలు ముడతలు ముడతలుగా ఉండి ఊదారంగుగా ఉంటాయి, వాటిమధ్యను ముక్కు ఎర్రని రంగు పూసినట్టుగా ఉంటుంది. వీటిమూలాన వాటి ముఖాలపై ఎవరో నామాలు దిద్దినట్టుగా కనిపిస్తుంది.

"డ్రిల్" కోతి కింది పెదవిపైన ఎర్రగా రంగు పూసినట్టు ఒక చార ఉంటుంది.

"హెమడ్రియాస్" కోతులు అని మరొక రకం ఉన్నాయి. ఈ రకం కోతులనే ఈజిప్టు వాసులు పూజించేవారు. వీటి మెడచుట్టూ బూడిదరంగు గల జూలు ఉంటుంది. ఈ కోతికి కోపం వచ్చినప్పుడు ఈ జూలు పిల్లి రోమాలలాగా నిక్కబొడుచుకుంటుంది. ఈ జాతి కోతులు చాలా భయంకరమైనవి. వీటిని జంతుప్రదర్శనశాలలో ఉంచినప్పటికీ వాటిలో అవి చచ్చేటట్టు పోట్లాడుకుంటాయి—కాని తమకు ఆహారం పెట్టవచ్చినవాడి జోలికి పోవు!

ఆఫ్రికాలో అనేక జాతుల కోతులున్నాయి. వాటిలో ఒకటి "మీసాల" కోతి. దీని పై దవడపైన పొట్టిగా కత్తిరించిన మీసాలలాటి

వెంట్రుకలుంటాయి. మరొక జాతి కోతికి కను రెప్పల పైభాగం తెల్లగా ఉండి, అది కళ్లు ఆర్పినప్పుడు చూడటానికి చిత్రంగా ఉం టుంది. ఈ కోతుల తోకలు ఎంతో పొడుగుగా ఉంటాయి. మరొక జాతి కోతి నల్లగా ఉంటుంది, దానికి తెల్లని వెంట్రుకలు గల జల్లితోక ఉంటుంది. దాని వీపుకు అటూ ఇటూ పొడుగైన తెల్లని వెంట్రుకలు వేళ్లాడుతూ ఉంటాయి.

మలయా, సుమత్రాలలో పెంపుడు కోతుల చేత పని చేయిస్తారు. యజమాని తన పెంపుడు కోతి నడుముకు పొడుగైన తాడు కట్టి కొబ్బరిచెట్టు ఎక్కిస్తే, అది కొబ్బరి గెలలోవున్న మంచి కొబ్బరికాయలను ఏరి, తుంపి, కింద పడవేస్తుంది.

"లంగూర్" కోతులుకూడా ప్రసిద్ధమైనవే. ఇవి మనదేశపు ఉత్తరప్రాంతాలలోనూ, కాశ్మీరులోనూ హెచ్చుగా ఉంటాయి. హను మంతుడు "లంగూర్" కోతి అని ఉత్తర దేశీయుల నమ్మకం; అందుకే వారు ఈ కోతులను "హనుమాన్ కోతులు" అని పిలుస్తారు. ఈ కోతులు నల్లగా ఉంటాయి, వీటి శరీరాలపైన గల రోమాలు తెల్లగా ఉంటాయి.

ఈ హనుమాన్ కోతుల తోకలూ, కాళ్లూ చాలా పొడుగుగా ఉంటాయి.



"లంగూర్" జాతికి చెందిన హనుమాన్ కోతి

"లంగూర్" జాతికి చెందిన కోతుల లాటివి, సింహళంలోనూ, టిబెట్‌లోనూ కూడా ఉన్నాయి. బోర్నియోలో ఉండే ఒక రకం "లంగూర్" కోతులకు పొడుగైన ముక్కు ఉంటుంది. దీనిమూలాన ఇవి "ముక్కు" కోతులు అన్న పేరు సంపాదించుకున్నాయి.

కోతులు మహా చెడ్డ అల్లరి చేస్తాయి— ఏ పిల్లలూ అంత అల్లరి చెయ్యలేరు. కాని వాటిలో కొన్ని చేసే అఘాయిత్యం వర్ణనాతీతంగా ఉంటుంది. దీనికి నిదర్శనంగా ఒక సంఘటన చెబుతాను :

వాషింగ్టన్‌లోని జంతుప్రదర్శనశాలలో ఉండటానికి మనదేశం నుంచి ఒక "టోపీ" కోతిని తీసుకుపోయారు. దీన్ని ఉంచిన బోను పక్కబోనులో ఒక మచ్చల దుమ్ములగొండి ఉండేది. ఈ టోపీకోతి అస్తమానం ఒక కంతకుండా గడ్డిపుల్ల దూర్చి దాన్ని పొడిచి కవ్వించి రెచ్చగొడుతూ ఉండేది. కొంత కాలానికి కోతికి ఈ "ఆట" విసుగెత్తింది. అది తన చేతిని తన బోను ముందుండే చువ్వల మధ్యగానూ, దుమ్ములగొండి ఉండే బోను ముందుండే చువ్వల మధ్యగానూ పోనిచ్చి దుమ్ములగొండి ముక్కు మీద కొట్టనారంభించింది. కోతి రోజూ ఇలా చేస్తున్నా దుమ్ములగొండి దాని చేతిని ఒక్కసారికూడా ఏమీ చేయలేకపోయింది. చిత్రమేమంటే రెండు బోనులకూ మధ్య చెక్క ఉండటంచేత దుమ్ములగొండిని కోతి చూసే అవకాశం లేదు. అయినా అది తన చేతిని సమయానికి వెనక్కు లాగేసేది. కోతులు తెలివిగలవి కావని ఎవరనగలరు?




ముక్కు కోతి




1. జి. కె. పాణి, బి.ఏ., కలకత్తా

క్రిందటినెల సంపాదకీయంలో "చందమామ"యొక్క అభివృద్ధికి తగు సూచనలు, సలహాలు కోరిరి. ఆ విధంగా నేను మీకు కొన్ని సూచనలు చేసితిని. కాని మీవద్దనుండి ఏ విధమైన జవాబు రాలేదు.

మీ సూచనలు మాకు అందాయి. ఇలాగే ఇంకా అనేకమంది పాఠకులు మాకు అనేక సూచనలను పంపారు. మీ అందరికీ కృతజ్ఞులం. వాటివల్ల పాఠకుల అభిరుచులు మాకు తెలిశాయి. ప్రతి ఒక్కరికీ జవాబు ఇవ్వటం సాధ్యమవుతుందా ?

2. ఏ. వి. ఎం. మోహనరావు, కాళహస్తి

భూమి కొన్ని వస్తువులను ఎక్కువగా ఆకర్షించును, కొన్ని వస్తువులను తక్కువగా ఆకర్షించును. ఎందువలన ?

భూమి ఏ వస్తువును ఎంతగా ఆకర్షిస్తున్నదో ఆ వస్తువు బరువే తెలుపుతుంది. వస్తువులో ఉండే "ద్రవ్యాన్ని" బట్టి భూమి ఆకర్షణా, వస్తువు బరువూ ఆధారపడతాయి.

"చందమామ"లో పూర్వకాలపు కథలు ఉంటైగాని, రైళ్లూ, కారులూ, బస్సులూ ఉండి ఆధునికయుగ లక్షణాలతో కూడిన కథలు లేవు, ఎందువలన ?

"చందమామ" పిల్లల పత్రిక. పిల్లలు తమకు సన్నిహితంగా ఉండే జీవితం నుంచికన్న పాతగాథలనుంచి తమకు పనికివచ్చే విషయాలు సులువుగా నేర్చుకుంటారు. రాజకుమారులకు విష్ణుశర్మ చెప్పిన పంచతంత్ర కథలలో మనుషులకు బదులు మృగాలను పెట్టటానికి ఇదే కారణం.

3. వడ్లమాని హనుమాయమ్మ, అమలాపురం

"చందమామ" వల్ల ఎంతమందికి ఉపాధి కలుగుతున్నది ?

"చందమామ"ను వివిధ భాషలలో రాసేవారూ, చిత్రకారులూ, ఆఫీసు ఉద్యోగులూ, దేశమంతటా, ఇతర దేశాలలోనూ గల ఏజెంట్లూ కలిపితే నాలుగైదు వేలమందిదాకా ఉంటారు.

4. రెడ్ల తాతారావు, గొల్లప్రోలు

'మన శరీరాలు' శీర్షికలో రక్తంలో ఎర్రకణాలకంటె హెచ్చు సంఖ్యలో తెల్లకణాలున్నాయని అన్నారు. సైన్సుప్రకారం తప్పు అని నా భావన. ఔనంటారా ?

ముమ్మాటికీ ఔను. పొరపాటు చూపినందుకు ధన్యవాదాలు. రక్తంలో 7, 8 వందల ఎర్రకణాలకు ఒక్క తెల్లకణం మాత్రమే ఉంటుంది.

5. కె. వెంకటరమణ, అనకాపల్లి

నేను "చందమామ"కు రెండు మూడు కథలు పంపించాను. ప్రచురించక పోవటానికి కారణం ఏమిటి ?

గడచిన పన్నెండేళ్లుగా "చందమామ"లో పడుతూవస్తున్న జానపద కథలన్నీ పాఠకులు పంపినవే. అయితే ఇటీవల వచ్చే కథలు పూర్వం పడినవిగానే ఉంటున్నాయి. కొన్ని చందమామ పాఠకుల అభిరుచికి తగినట్టుగా ఉండటంలేదు. మీరు పంపే కథలు పడకపోవటానికి ఇంతకంటె వేరే కారణం ఏమీ ఉండదు.

6. సి. కె. రామచంద్రన్, సదాశివపేట

రాజకీయ, మత సంబంధమైన ప్రశ్నలు అడగవద్దని వ్రాసినారే, వాటితో మీకు ప్రసక్తి లేకనా ?

ఎవరి రాజకీయాలు, ఎవరి మతవిశ్వాసాలు వారికి ఉండవచ్చు. కాని "చందమామ" ఆశయం సంస్కృతిని పెంపొందించి పిల్లలను ఏకం చెయ్యటం. రాజకీయాలూ, మత విశ్వాసాలూ మనుషులను ఎలా చీలదీస్తాయో మీకు తెలుసుగదా !

7. యేచూరి చలపతిరావు, కాకినాడ

మహాశయా! "చందమామ" కథలమాసపత్రికను పిల్లలకొరకు ప్రత్యేకంగా వెలువరచుటలో మీ ముఖ్యోద్దేశము ?

ఇళ్లలో పిల్లల అల్లరి కొంతవరకైనా తగ్గించాలని! చేతిలో "చందమామ" ఉండగా అల్లరిచేసే పిల్లలను ఎప్పుడైనా చూశారా ?

వెనుక "చందమామ"లో ప్రచురింపబడిన "తోకచుక్క" "జాతక కథలు" పుస్తక రూపాలుగా అవతరించాయాండీ ? వెల ఎంతెంతండీ ?

"జాతక కథలు" (21 కథలు) పుస్తకంగా వెలువడ్డాయి. ఆ పుస్తకం వెల 75 నయాపైసలు. "తోకచుక్క" ఇంకా వెలువడలేదు. వీలువెంట "చందమామ"లో వెలువడిన సీరియల్ కథలను పుస్తకాలుగా ప్రచురించాలనే ఉద్దేశంలోనే ఉన్నాం.

# మీరు విన్నారా?

అర్మీనియాదేశపు విజ్ఞానపరిషత్తుకు అధిపతీ, నక్షత్రశాస్త్రజ్ఞుడూ అయిన విక్టోర్ అంబర్తుమ్యాన్, ఆకాశంలో ఎంతో దూరాన "నీలినక్షత్ర కూటా" లున్నాయనీ, అక్కడ కొత్త కొత్త నక్షత్ర లోకాలు సృష్టి అవుతున్నాయనీ, అక్కడినుంచి శక్తివంతమైన కాస్మిక్ కిరణాలు ప్రసార మవుతున్నాయనీ అన్నాడు. ఒక్క సెకండులో 186,000 మైళ్లు పరిగెత్తే కాంతి ఈ "నీలి నక్షత్ర కూటాల" నుంచి మనని చేరటానికి అనేక లక్షల సంవత్సరాలు పడుతుందట!

* * *

గడచిన రెండేళ్లపైచిల్లర కాలంలో సోవియెట్ శాస్త్రవేత్తలూ, అమెరికన్ శాస్త్రవేత్తలూ అనేక కృత్రిమ ఉపగ్రహాలను ప్రయోగించారు. సోవియెట్ ఉపగ్రహాలకు "స్పుత్నిక్" లని పేరు పెట్టారు. ఇవి మొత్తం మూడు.

మొదటి స్పుత్నిక్—1957 అక్టోబరు 4న ప్రయోగించబడి, భూమిచుట్టూ 92 రోజులపాటు తిరిగి, 3,68,00,000 మైళ్లు నడిచి, 1958 జనవరి 4 న రాలిపోయింది.

రెండవ స్పుత్నిక్—1957 నవంబరు 3 న ప్రయోగించబడి, భూమిని 161 రోజులు చుట్టి, 6,30,00,000 మైళ్లు నడిచి, 1958 ఏప్రిలు 13 న రాలిపోయింది.

మూడవ స్పుత్నిక్—1958 మే 15 న ప్రయోగించబడి ఇంకా తిరుగుతూనే ఉన్నది. ఇది గత మార్చి 30 మధ్యాన్నానికి 12,10,00,000 మైళ్లు నడిచింది.

అమెరికను ఉపగ్రహాలు:

మొదటి ఎక్స్‌ప్లోరర్—1958 జనవరి 31న ప్రయోగించబడింది. గత మార్చి 30 మధ్యాన్నానికి 15,15,00,000 మైళ్లు నడిచింది.

మొదటి వాన్‌గార్డ్—1958 మార్చి 17 న ప్రయోగించబడింది. గత మార్చి 30 మధ్యాన్నానికి 14,60,00,000 మైళ్లు నడిచింది.

ఆరవ ఎక్స్‌ప్లోరర్—1958 జులై 26 న ప్రయోగించబడింది. గత మార్చి 30 మధ్యాన్నానికి 7,95,00,000 మైళ్లు నడిచింది.

రెండవ వాన్‌గార్డ్—1959 ఫిబ్రవరి 17 న ప్రయోగించబడింది. గత మార్చి 30 మధ్యాన్నానికి 1,47,00,000 మైళ్లు నడిచింది.

* * *

ఇటీవల సోవియెట్ తిమింగిలాల వేటగాళ్లు ఒక వింత తిమింగిలాన్ని పట్టుకున్నారు. దాని అడుగు భాగంలో వెనుకగా అంతరించిపోతున్న పాదాలలాటివి ఉన్నాయి. ఆ పాదాలకు ఎముకలుకూడా ఉన్నాయి. దీనినిబట్టి తిమింగిలాల పూర్వీకులు భూచరాలుగా ఉండేవని రుజువవుతున్నది.

మన జాతీయ పరిశోధనాలయాలు :

# 4. సెంట్రల్ డ్రగ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్

ఔషధాల ఉత్పత్తిలో మన దేశం చాలా వెనకపడివున్నది. అధునిక ఔషధాలను దిగుమతి చేసుకోవటానికి మనం బోలెడంత డబ్బు ఖర్చుచేస్తున్నాం. ఆయుర్వేద, యూనానీ చికిత్సలలో వుపయోగించే మూలికలు మొదలైనవి కొన్ని చాలా అమోఘమైనవేగాని వాటిని గురించి పరిశోధనలు జరగలేదు. ఈ కొరతను తీర్చటానికే సెంట్రల్ డ్రగ్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఏర్పాటయింది. లక్నోలోని చరిత్రప్రసిద్ధి గల చత్తర్ మంజిల్ రాజభవనంలో ఈ సంస్థను ఏర్పాటుచేశారు. 200 ఏళ్లక్రితం నిర్మించిన ఈ భవనంలో కొన్ని అవసరమైన మార్పులు చేయబడ్డాయి.

మనం దిగుమతిచేసుకునే ఔషధాలలో మూడవవంతుకు పైగా మన దేశంలో దొరికే వస్తువులతో తయారయినవే. మిగిలిన ఔషధాలలో అనేకవాటికి ప్రత్యామ్నాయాలు మన దేశంలో దొరకవచ్చు. దీనినిగురించి విరివిగా పరిశోధనలు జరగాలి.

పరిశోధనల నిమిత్తం ఈ సంస్థకు అనేక అధునిక పరిశీలన పరికరాలున్నాయి; తెల్ల ఎలుకలూ, చిట్టెలుకలూ, గినీపందులూ, చెవుల పిల్లులూ, పిల్లులూ, కోతులూ వున్నాయి.

దేశీయమైన మూలికల నుంచి ఔషధాలు తయారుచేయటానికి ఈ సంస్థ కృషి చేస్తున్నది. మూలికల తాలూకు వస్తుగుణదీపిక ఒకటి అచ్చయింది. అనేకమైన అమూల్య ఔషధాలు ఈ సంస్థచేత కనిపెట్టబడుతున్నాయి.



# వినోదాలు

అమెరికాలోని ఒక కోటీశ్వరుడు తన సొంత జెట్ విమానంలో భూప్రదక్షిణానికి బయలుదేరాడు. విమానం నడిపేవాడు కోటీశ్వరుడితో, "అయ్యా, ఇప్పుడు మనకు దిగువగా ఉన్నది లండను నగరం!" అన్నాడు.

"వివరాలు అవసరంలేదు. అది ఏ దేశమో చెప్పు, చాలు!" అన్నాడు కోటీశ్వరుడు.

*　　　　*　　　　*

అతివేగంగా వెళ్లే ఒక కొత్త జెట్ విమానాన్ని అమెరికాలో నిర్మించారట. దాన్ని నడిపి చూడటానికి ఒక పైలట్ ముందుకు వచ్చాడు. అతను దాన్ని సులువుగానే గాలిలోకి తీసుకుపోయి వేగం హెచ్చించాడు.

కొంతసేపయాక అతను రేడియోలో కింద ఉన్నవారిని, "నేనెంత వేగంతో పోతున్నాను?" అని అడిగాడు.

"గంటకు పన్నెండు వందల మైళ్లు!" అని జర్మనుభాషలో సమాధానం వచ్చింది.

పైలట్ నిర్ఘాంతపోయి, "నిజంగానా?" అన్నాడు.

"ఏమీ సందేహం లేదు!" అని ఈసారి రష్యన్ భాషలో జవాబు వచ్చింది.

"అరి భగవంతుడా!" అన్నాడు పైలట్.

"ఏం, బాబూ?" అని అపరిచిత కంఠస్వరం ప్రశ్నించింది.

*　　　　*　　　　*

జార్జి బెర్నార్డ్‌షా రాసిన ఒక నాటకంలో పాత్రలు చాలా ఉన్నాయి. కాని అది స్టేజిమీద ఆడటం మొదలుపెట్టిననాడు జనం రాలేదు. మర్నాడు ప్రదర్శనం ప్రారంభమయే ముందు ఒక నటి అదుర్దాగా తెరల సందులనుంచి ప్రేక్షకులను చూడసాగింది. షా ఆమెను సమీపించి, "జనం ఏపాటి ఉన్నారు?" అని అడిగాడు.

"నిన్నటికన్న కాస్త నయమే!" అన్నది నటి.

"అయినా ఇంకా మెజారిటీ మనదే!" అన్నాడు షా.

*　　　　*　　　　*

ఫ్రాంక్ హారిస్ అనే విమర్శకుడు ఆర్నాల్డ్ బెనెట్ రాసిన ఒక నవలను సమీక్షిస్తూ, అందులో బెనెట్ వర్ణించిన మరణదండన దృశ్యం తప్పుగా ఉందనీ, అలాటి దృశ్యాలు బెనెట్ చూడలేదనీ, ఆ దృశ్యం ఫలాని విధంగా ఉంటుందనీ రాశాడు.

ఆ విమర్శ చదివి బెనెట్ హారిస్‌కు ఉత్తరం రాస్తూ, "మీ వర్ణన ముందే చదివి ఉంటే నేను దానిని ఉపయోగపరుచుకుని ఉండేవాణ్ణి. మీరు నా రహస్యం బాగా కని పెట్టారు. నేనెన్నడూ మరణదండనలు చూడలేదు," అని రాశాడు.

"నేనూ ఎన్నడూ చూడలేదు," అని ఫ్రాంక్ హారిస్ జవాబు రాశాడు.

# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 అక్టోబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగస్టు నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## అగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బేరం రాకపోతే కునుకు

రెండవ ఫోటో : సారం లేకపోతే కొనకు

పంపినవారు : బలివాడ వెంకట రామారావు, C/o పి. ఎస్. పాత్రో

ఎండాడ పోస్టు, (వయా) వాల్తేరు R. S.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలో ఆడుకునేందుకు వెళ్ళేసరికి, ఒక పెద్దమనిషి చెట్టుకు ఆనుకు కూచుని చదువుకుంటూవుండటం కనిపించింది. దాసూ, వాసూలు దూరంగా వెళ్లి బంతితో ఆడుకోవటం ప్రారంభించారు. అది ఎగిరి వెళ్లి చదువుకుంటున్న పెద్దమనిషి దగ్గిర పడింది. దాన్ని తెచ్చేందుకు 'టైగర్' పరిగెత్తేసరికి, పెద్దమనిషి దాన్ని గొడుగుతో కొట్టబోయాడు. గొడుగు ఎత్తటం చూస్తూనే 'టైగర్' వెల్లికిలా పడిపోయింది. ఏమి జరిగిందా అని పెద్ద మనిషి ఆశ్చర్యపడేంతలో, 'టైగర్' లేచి, కిందపడివున్న గొడుగును నోట కరుచుకుని పారిపోసాగింది. అది చూసి దాసూ, వాసూలు విరగబడి నవ్వారు






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'





## మాజ్డ దీపములు

ఎక్కువ కాలము ప్రకాశవంతముగా వెలుగును







అసోసియేటెడ్ ఎలెక్ట్రికల్ ఇండస్ట్రీస్
(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
హెడ్ ఆఫీసు : క్రౌన్ హౌస్, 6, మిషన్ రో, కలకత్తా
బ్రాంచీలు
బొంబాయి, న్యూఢిల్లీ, మద్రాసు, బెంగుళూరు, కోయంబత్తూరు, నాగపూరు

నియమించబడ్డ డీలర్లు :

AIC 208 TE

రఘునాథ ట్రేడింగ్ కార్పొరేషన్, గుంటూరు. :: మచ్‌కుండ్ ఎలెక్ట్రికల్ స్టోర్సు, విజయవాడ-2.
మోటార్స్ & జనరల్ స్టోర్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొబ్బిలి.



## అన్నిచోట్ల అందరికి అందుబాటులో వుండే మా సాటిలేని




# రాజా
## బనియనులు

రాజా నిట్టింగ్ కంపెని
P. B. No. 24, తిరుపూరు

ఏజంట్లు :

## గొల్లపూడి బ్రదర్సు

సత్యనారాయణపురం :: విజయవాడ-2

---

**పేరెన్నికగన్న మా "KKK" రకమును అడగండి.**

# ప్రేమలో పడ్డ సింహం







అనగా అనగా ఒకప్పుడు....

కట్టెలు కొట్టేవాని అందమైన కూతురిని ఒక సింహం ప్రేమించింది. ఆ అమ్మాయికి సింహం రోజూ పూలు తెచ్చిస్తూ ప్రణయం సాగించింది. కట్టెలవాడు ముదుసలి. జిత్తులమారి. అతడు ఒకనాడు సింహంతో "ఓ మృగరాజా! అంత పొడుగైన గోళ్లూ, కోరలూ ఉన్న భర్తతో నా కూతురు కాపరం చేయదు" అని చెప్పాడు.

సింహం ఆ అమ్మాయిని బాగా ప్రేమించింది. అందువల్ల తన గోళ్లూ, కోరలూ కట్టెలవాడి చేత పీకించుకుంది.

తరువాత కట్టెలవాడు ఒక పెద్ద దుడ్డు కర్ర తీసుకొని సింహాన్ని తరిమివేశాడు.

"తెలివి తక్కువ సింహం!" ఆ అమ్మాయి నిట్టూర్చింది. "ఆ సింహం నాకు పారీన్ మిఠాయిలే గనక తెచ్చిఉంటే, గోళ్లు ఉండనీ, కోరలు ఉండనీ, సంకోచించకుండా, పెండ్లి చేసుకొనేదాన్ని" అని అనుకుంది.

నీతి : మీకు ప్రియమైన వారిలో ఎవరో ఒకరు మిఠాయిలంటే ఎంతో ఇష్టపడేవాళ్ల ఉన్నారు






ప్యారిన్ మిఠాయిలు ఎంతో రుచిగా ఉంటాయి. పరిశుద్ధమైనవి. పుష్టికరం కూడ. అవి విడిగాగాని, రు 1.75 నుంచి రు 5/- ల వరకు అందమైన సగిషీ డబ్బాలలో గాని లభిస్తాయి.

తయారి : పారీన్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు



PRS 517

Photo by S. N. Somani



బహుమతి పొందిన వ్యాఖ్య

సారం లేకపోతే కొనకు

పంపినవారు : బి. వి. రామారావు - ఎండాడ

